శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః



# అపూర్వస్తోత్రకదంబకం

( పలువురు పరకాల మఠాధిపతులు అనుగ్రహించిన
స్తోత్రాల సంకలనం, పరకాలమఠ గురుపరంపరా వైభవంతో)

ప్రకాశకులు
శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలమఠం
భక్తబృందం
ధర్మవరం, అనంతపురం జిల్లా

**2013**

# అపూర్వస్తోత్రకదంబకం

"పండితరత్న", వేదాంతవాచస్పతి
ఉ.వే. శ్రీమాన్ డా ॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

ప్రతులు : 500

ప్రకాశకులు : బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలమఠం, ధర్మవరం.

అన్నిహక్కులు : రచయితవే.

ఆవిష్కరణము : గోదాకల్యాణము - 13-1-2013

వేదిక : పరకాలమఠం, ధర్మవరం

ఈగ్రంథము, ధర్మవరంలోని పరకాలమఠానికి చెందిన భక్తబృందం అందించిన ఆర్థికసహాయంతో ముద్రింపబడింది.

ప్రతులకు : శ్రీమాన్ జి. కృష్ణమూర్తి శెట్టిగారు
ప్రెసిడెంట్, శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలమఠము
మార్కెట్ వీధి, ధర్మవరం-515 671,
అనంతపురం జిల్లా

అక్షరయోజనము : శ్రీమతి జయలక్ష్మి మరియు
శ్రీచంద్రశేఖర్

ముద్రణ : సి.యన్. ప్రింటర్స్, తిరుపతి





Phone : 0821-2422536

**ಶ್ರೀ ಬ್ರಹ್ಮತಂತ್ರ ಸ್ವತಂತ್ರ ಪರಕಾಲಸ್ವಾಮಿ ಮಠ**

ಮೈಸೂರು - 570024.

**SRI BRAHMATANTRA SWATANTRA PARAKALA SWAMY MUTT**

Krishnavilasa Road (Near J.M. Palace), Devaraja Mohalla, Mysore - 570 024, Karnataka State, INDIA

Sree Lakshmi Hayavadana Lakshmi Narayanabhyam Namaha
Sreemathe Ramanujaya Namaha
Srimathe Nigamantha Maha Desikaya Namaha
Sri Brahmatantra Swatantra Parakala Guruparamparayai Namaha

# స్వస్తివాచనం

"వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్, విష్ణురారాధ్యతే పంథాః నాన్యస్తత్తోష కారకః" అనే శ్రీవిష్ణు పురాణసూక్తి వర్ణాశ్రమాచారాలను అనుసరించి ప్రవర్తించడం పరమపురుషుడైన భగవానునకు ప్రీతిజనకమని, వేఱొక మార్గం ఏదీ భగవత్ప్రీతికరం కాదని తెల్పుతున్నది. శ్రుతి, స్మృతులలో విధింపబడిన ఆచారాలు అన్నీ భగవదాజ్ఞారూపాలు. "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్య వర్తతే, ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ మద్భక్తోఽపి న వైష్ణవః" అని అంటూ సాక్షాత్తు భగవానుడే శ్రుతిస్మృతులలోని ఆచారాలన్నీ తన అజ్ఞారూపాలని, వానిని ఉల్లంఘించి ప్రవర్తించినవాడు తన ఆజ్ఞను మీరిన ద్రోహి అని, అతడు తన భక్తుడైనా వైష్ణవుడు కాబోడని స్పష్టం చేశాడు.

ఈవిధంగా భగవానునిచే ఆజ్ఞాపింపబడిన ఆశ్రమాలు నాల్గు. అవి - బ్రహ్మచర్య - గార్హస్థ్య - వానప్రస్థ - సన్న్యాసాలు. వీటిలో చివరిది అయిన సన్న్యాసాశ్రమం ఉత్తమాశ్రమంగా ప్రసిద్ధి చెందింది. ఇహలోక బంధాలకు అతీతుడై, సచ్ఛబ్దవాచ్యుడైన పరమాత్మసన్నిధిలో తమ ఆత్మరక్షణ భారాన్ని సమర్పించి, తన శక్తియుక్తులను అన్నిటినీ విశ్వజనీనంగా - అంటే - విశ్వజన హితంకోసం వినియోగించే అద్భుతమైన, అత్యంతం పవిత్రమైన జీవనశైలి ఇది. అనాదిగా ఎంతోమంది మహనీయులు ఈ ఆశ్రమంలో తమ జీవితాన్ని సాగించి భగవద్భాగవతాచార్య సేవలతోపాటు సామాజిక సేవలను కూడా నిర్వర్తించి ధన్యులయ్యారు.

భగవద్రామానుజులు ఈ ఉత్తమాశ్రమాన్ని స్వీకరించి పరమవైదికమైన శ్రీరామానుజ సిద్ధాంత ప్రచారం కోసం, విశ్వశ్రేయస్సు కోసం తమ జీవితాన్ని వినియోగించిన విషయం వారి పవిత్ర చరిత్ర ద్వారా వ్యక్తమవుతున్నది. వీరు ఈ రీతిలో తాము సన్న్యాసాశ్రమ స్వీకారాన్ని చేయడమేకాక, తిరుమల, శ్రీరంగం, తిరునారాయణపురం (మేల్కోటె) వంటి దివ్యక్షేత్రాలలోని ఆలయాల ఆచార వ్యవహారాల నిర్వహణ - పరిరక్షణలకోసం ఈ సన్న్యాసాశ్రమవ్యవస్థను ఆధారంగా చేసికొని, జీయర్ మఠ వ్యవస్థనుకూడా ఏర్పాటుచేశారు. ఆవిధంగా ప్రారంభమైన



శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన ఈ జీయర్‌మఠ వ్యవస్థ ఈనాటికి తిరుమల, శ్రీరంగం వంటి పలుక్షేత్రాలలో కొనసాగుతూ ఉన్నది.

ఈ క్రమం తదనంతరం కాలంలో కూడా కొనసాగి మఱికొన్ని జీయర్ మఠాల ఆవిర్భావానికి దోహదంచేసింది. శ్రీమద్వేదాంతదేశికుల సాక్షాత్ శిష్యులు. శ్రీబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి వారిచే ప్రారంభింపబడిన పరకాల మఠం వాటిలో ఒకటి. ఈ మఠం మొదట కాంచీనగరంలోని తూప్పుల్ అగ్రహారంలో ఏర్పాటైనది. తరువాత తిరుపతి మొదలైన క్షేత్రాలలో కూడా దీని శాఖలు విస్తరించాయి. పరకాల మఠం వ్యవస్థ ఈ ఆలయ నిర్వహణకు సంబంధించినది కాకపోయినా, భగవద్రామానుజులు, వేదాంతదేశికులు వంటి పూర్వాచార్యులచే ప్రబోధింపబడి, ప్రచారంచేయబడిన శ్రీవైష్ణసిద్ధాంతం యొక్క వ్యాప్తిని ప్రధానకర్తవ్యంగా భావించి, అందుకోసం అనవరతం అద్వితీయంగా ప్రయత్నించే పవిత్ర సంస్థ. ఈ మఠంయొక్క ఆధిపత్యాన్ని అలంకరించిన యతీశ్వరులందఱు గొప్ప పండితులు. భగవద్రామానుజ సిద్ధాంత వ్యాప్తికోసం, సమాజ శ్రేయస్సు కోసం ఎనలేని ఎడతెగని కృషిచేసిన మహాత్ములు. వీరిలో పలువురు పలు కృతులను రచించిన మహాకవులు, శాస్త్రవిద్వాంసులు కూడా. కాలక్రమేణ మైసూర్ నగరాధిపతిచేత మిక్కిలి అభిమానింపబడి పోషింపబడిన ఈ మఠం మైసూర్ నగరప్రాంతంలో చాలా ప్రసిద్ధిచెందింది.

క్రీ.శ.1971వ సం. నుండి 1992 సం. వరకు సుమారు 21 సం.ల పాటు పరకాలమఠాధిపత్యాన్ని నిర్వహించిన శ్రీమదభినవరామానుజ బ్రహ్మతంత్ర పరకాలస్వామివారి శతమానోత్సవ సందర్భంగా "ఆచార్యసంభావనా" అనే పేరుతో ఒక స్మారక సంచిక ముద్రింపబడింది. అందులో పలువురు మఠాధిపతులు అనుగ్రహించిన అపూర్వాలైన స్తోత్రాలలో కొన్ని "Rare purvacharya woks" అనే పేరుతో ఆంగ్లానువాదసహితంగా ముద్రింపబడ్డాయి. అంతేకాక, పరకాలమఠానికి చెందిన గురు పరంపర చరిత్రకూడా అందులో ఆంగ్లభాషలో ముద్రింపబడింది. కాని, ఈ స్తోత్రాలన్నీ సంస్కృత భాషలో ఉండడంవల్ల, వీటి

అనువాదం కూడా ఆంగ్లభాషలో చేయబడడంవల్ల, పరకాలమఠ జీయర్ చరిత్ర కూడా ఆంగ్లభాషలో ఉండడం వల్ల ఆంధ్ర దేశీయులైన భక్తులకు వీటి అనుభవం అందుబాటులో లేదు. ఈ కొరతను గుర్తించి తీర్చడం కోసంగా ధర్మవరంలోని పరకాలమఠాన్ని ఎంతో భక్తిశ్రద్ధలతో నిర్వహించే ఆస్తికులు, ఆ మఠం అధ్యక్షులు శ్రీమాన్ పి.కృష్ణమూర్తి శెట్టిగారు, వారి కుమారులు శ్రీమాన్ కొండయ్యగారు ఈ స్తోత్రాలను, జీయర్‌పరంపరకు చెందిన చరిత్రను ఆంధ్రభాషలో అనువదింపజేసి ముద్రించాలని ఆశపడి, అనువాద కైంకర్యాన్ని నిర్వహించ వలసినదిగా నన్ను కోరారు. పరమపవిత్రమైన ఈసేవను నాకు ఇచ్చినందులకు వారిరువురకు నేను చాలా కృతజ్ఞుడను. ఆ సత్కార్యాన్ని నేను యథాశక్తి నిర్వర్తించడానికి ప్రయత్నించాను. నా అనువాదంలోని లోటుపాట్లను సహృదయ పాఠకులు సహిస్తారని నమ్ముతున్నాను. ఇంతకుముందే పూర్వమే, ధర్మవరంలోని పరకాల మఠానికి చెందిన భక్తబృందం ఆళ్వార్లు తిరుమాలిరుమ్‌శోలై, తిరునిర్మలై అనే దివ్య క్షేత్రాలను స్తుతిస్తూ అనుగ్రహించిన పాశురాల వివరణతో కూడిన ఒక గ్రంథాన్ని, ఇరామానుశ నూత్రన్దాది గ్రంథాన్ని ముద్రించారు. ఇప్పుడు ఈ పవిత్ర గ్రంథాన్ని ముద్రించడానికి మళ్ళీ తమ ఉత్సాహాన్ని ప్రదర్శించడం వారి ఆస్తికతను, సహృదయతను మరొక్కమారు నిరూపిస్తున్నది. వారిని అందరిని నేను హృదయపూర్వకంగా అభినందిస్తూ, వారిద్వారా మరిన్ని సద్గ్రంథాలు త్వరలో ప్రచురింపబడాలని, ఆవిధంగా వారిని శ్రీనివాస ప్రభువు అనుగ్రహించాలని ఆశిస్తున్నాను. దీని ముద్రణకు పరమహంసపరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ అభినవ వాగీశ బ్రహ్మతంత్రపరకాలస్వామివారి (వర్తమాన స్వామివారి) మంగళాశాసనాలు లభించడం కూడా విశేషం. వారి సన్నిధిలో సవినయంగా, కృతజ్ఞతాపూర్వకంగా సాష్టాంగదండప్రణామాలను సమర్పించుకొంటున్నాను. ప్రకృత గ్రంథ ముద్రణం భగవద్రామానుజులకు, శ్రీమద్వేదాంత దేశికులకు, పరకాల మఠాధిపతులకు, భక్తబృందానికి ఆనందాన్ని కలిగించే కైంకర్యం కాగలదనడంలో సందేహం లేదు. స్వస్తి.

ఇట్లు, నివేదించు
భాగవత విధేయుడు
ఈ.ఏ. శింగరాచార్యులు

తిరుపతి
13-9-2012



# శ్రీబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి మఠసంస్థాపన చరిత్ర

శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్రపరకాలస్వామిమఠం శ్రీవైష్ణవసంప్రదాయానికి చెందిన సుప్రసిద్ధమైన సంస్థలలో ఒకటి అనేది సర్వవిదితమైనవిషయం. ఈ సంస్థ ప్రాదుర్భావం శ్రీనిగమాంత మహాదేశికుల కాలంలోనే, వారి సమక్షంలోనే, వారి అనుజ్ఞతోనే జరిగింది. ఈ మఠం క్రీ.శ.1338వ సం॥ల కాంచీపురంలో ప్రథమ బ్రహ్మతంత్ర స్వతంత్రజీయర్ స్వామివారిచే శ్రీదేశికుల ఆజ్ఞానుసారం ఆరంభింప బడింది. ఈబ్రహ్మతంత్ర స్వతంత్ర జీయర్ స్వామి శ్రీదేశికుల ప్రధాన శిష్యులలో ఒకరు. ఈ జీయర్‌స్వామి సన్న్యాసాశ్రమ స్వీకారంచేసినపుడే ఈ పరకాల మఠ ప్రాదుర్భావంకూడా జరగడం విశేషం.

భగవద్రామానుజుల శ్రీవైష్ణవసంప్రదాయానికి చెందిన ఈ మఠానికి సంబంధించిన ఆచార్యపరంపర ఆనాటినుండి ఈనాటివరకు అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నది. ఈ మఠానికి చెందిన ఆచార్యులందఱు వారి ఉపదేశాలతో, అనుష్ఠానాలతో, సద్గ్రంథాలతో శ్రీసంప్రదాయాన్ని రక్షించి, విశ్వవ్యాప్తం చేశారు. మహానుభావులైన ఈ యతిశేఖరులచరిత్రలు పరకాలమఠ గురుపరంపరను తెలిపే చారిత్రకమైన ప్రామాణికాధారాలలో, క్రీ.శ.13వ శతాబ్దినుండి నిక్షిప్తాలై, ఈనాటికీ సురక్షితంగా లభిస్తున్నవి.

చాలా వాస్తవవిషయాలు, వివరాలు శ్రీవరదరాజస్వామి దేవాలయంలోని శిలా తామ్రశాసనంలో లభిస్తున్నాయి. కంచి వరదరాజస్వామి ఆలయం రెండవ ప్రాకారంలోని ఉత్తర దిక్కుగోడలపై కన్పించే కొన్ని ముఖ్యమైన శాసనాలలో చాలా అంశాలను గమనించవచ్చు. ఈ శాసనాలు సాంప్రదాయికమైన తమిళ లిపిలో, భాషలో, సంస్కృతభాషా పదాలతో కూడి ఉన్నాయి. ఇవి ఆనాటి శ్రీవైష్ణవ సంప్రదాయచరిత్రను తెలిపే అత్యంతప్రధానమైన ఆధారాలుగా చెప్పవచ్చు.

విశేషమేమంటే - ఈ మఠసంస్థాపనకు సంబధించిన ఏప్రభువుచేత వ్రాయించబడినట్లుగా కన్పించదు. ఆలయంలోని స్వామి పేరుపై ఈ శాసనాలను వ్రాయించనట్లుగానే కన్పిస్తుంది. మంగళాచరణంతో ప్రారంభమైన ఈ శాసనం (తిరుముగప్పడి) ఈ క్రిందివిధంగా ఉన్నది.

## తిరుముగప్పడి

ఏతత్ సురాసురాధీశమౌళి రత్నప్రభారుణమ్ ।

శ్రీమత్ హస్తిగిరీశస్య దేవదేవస్య శాసనమ్ ॥

వికారి సంవత్సరత్తు మేషమాసత్తు పూర్వపక్షత్తు ప్రథమైయుమ్ వెళ్ళిక్కిళమైయుమ్ పెట్ర ఆస్వతినాళ్ అభిషేకమండపత్తు వీరవల్లాళన్ సింహాసనత్తు అరియనవల్లాన్ పన్దలికీళ్ నాముమ్ నమ్ పెణ్ణుకళుడన్ శడకోపన్ పాట్టు క్కేళానిఱ్క, నమ్‌వీడు కరుమమ్ కేట్కుమ్ పెరుమాళ్ తాతనుమ్, నమ్ పట్టర్‌కళుమ్ శొల్లక్కేట్టు బ్రహ్మతంత్ర స్వతంత్ర జీయన్ - ఎన్ఱు నామ్ పేర్ కొడుత్త వైష్ణవదాసనుక్కు నామ్ కొడుత్త పడి.

ఇవనుక్కు ఉణ్డాన మడముమ్, మడత్తై నోక్కి వరుమ్ క్షేత్రముమ్, సమారాదనముమ్, అతుక్కు వేణ్డుమ్ ముత్తుక్కళుమ్, ఇవన్ తేడిన పుత్తకఙ్గళుమ్, ఇదఱ్కు వేణ్డుమ్ ఉపకరణఙ్గళమ్, నమ్ రామానుజదర్శనమ్ నడక్కైక్కాక, ఇవనుక్కుమ్ పిన్బుమ్ నియమిత్త ఇవనుడైయ శిష్యర్‌కళ్ పరమ్పరైయాక ఇవఱ్ఱై క్కైక్కొణ్డు నడత్తి ప్పోడక్కడవర్‌కళ్ ఆకవుమ్,

ఇవనై నమ్ రామానుజన్ ఉడైయారుమ్, నమ్ శమయత్తిల్ ఉళ్ళారుమ్ కైక్కొణ్డు నడత్తిప్పోర చ్చొన్నోమ్.

ఇచ్చెయ్‌దియై క్కల్లిలుమ్ శెమ్బిలుమ్ వెట్టి క్కొళ్ళుమ్బడి. ఇవనుక్కు నామ్ ముడిత్త పడియుమ్, ఉడుత్తపడియుమ్, పూశిన పడియుమ్ కొడుత్తోమ్. ఇప్పడిక్కు త్తిరువాయ్ మలర్న్దరుళినపడిక్కు కోయిల్ కణక్కు పేరరుళాళ ప్రియన్ ఎళుత్తు. ఇత్తిరుముకమ్ ఎళుదిన శతాబ్దమ్ ఆయిరత్తు ఇరునూఱ్ఱు ఎణ్బత్తు ఇరణ్డావదు.

## అనువాదం

ఇది, సురాసురప్రభువుల కిరీటాలలోని రత్నాల కాంతులతో ఎఱ్ఱగా ప్రకాశించే హస్తిగిరినాథుడైన దేవదేవుని (వరదరాజస్వామి)యొక్క శాసనం.

వికారినామసంవత్సరం మేషమాసం పూర్వ పక్షం (శుక్లపక్షం) ప్రథమా తిథి శుక్రవారంతో కూడిన అశ్వినీనక్షత్రంనాడు అభిషేక (తిరుమంజన) మండపంలో "వీరవల్లాళన్" సింహాసనంలో "అరియనవల్లాన్" పందిరి క్రింద మేము మా దేవేరులతో కలసి శఠకోపుల పాశురాలను ఆలకిస్తూ ఉండగా, మా ఆలయ కార్యాలను పర్యవేక్షించే పెరుమాళ్ తాతర్, మా భట్టర్ స్వాములు చెప్పగా విని, బ్రహ్మతంత్ర స్వతంత్ర జీయర్ - అనే మేము పేరు పెట్టిన వైష్ణవదాసునకు మేము ఇచ్చిన



అనుమతి (అనుగ్రహం).

ఇతనికి ఉండే మఠం, మఠాన్ని ఉద్దేశించి వచ్చే (ఇవ్వబడే) క్షేత్రాలు, సమారాధనం, దానికి ఆవశ్యకమైన సంభారాలు, ఇతడు సంపాదించిన గ్రంథాలు, వీటికి కావలసిన ఉపకరణాలు - అన్నీ మన రామానుజదర్శనాన్ని నిర్వహించడం కోసం. ఇతనికి తరువాత ఇతడు నియమించిన ఇతని శిష్యులు పరంపరగా వీటిని గ్రహించి, నిర్వహించాలని - అని,

ఇతనిని మా రామానుజదాసులు, మన సంప్రదాయంలో ఉండేవారు అంగీకరించి వర్తించాలని పలికాము.

ఈ మాటలు శిలాఫలకంలో తామ్రంలో చెక్కించాలి. ఇతనికి మేము అలంకరించుకొన్న పూలు, ధరించిన వస్త్రాలు, పూసికొన్న చందనం అనుగ్రహించాము. ఈ విధంగా (వరదరాజస్వామి) పల్కిన రీతికి ఆలయ గణనం. పేరరుళాళన్ సంతకం. ఈ పత్రం వ్రాయించినది శతాబ్దం ఒకవేయి రెండు వందల ఎనభైరెండవ సంవత్సరం.)

వరదరాజస్వామి ఆలయంలో ఇంకొక శాసనంకూడా లభిస్తున్నది. ఇందులో వరదరాజస్వామి ఆజ్ఞానుసారంగా చాలా గ్రామాలు సర్వమాన్యంగా బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామికి ఇవ్వబడినట్లు తెలుపబడింది.

దక్షిణ ఆర్కాట్ జిల్లాలోని కొన్ని ఆలయాలలో లభించే 14వ, 15వ శతాబ్దాలకు చెందిన కొన్ని శాసనాలలోకూడా ఈ మఠానికి సంబంధించిన కొన్ని శాసనాలున్నాయి. వేఱొక శిలాశాసనం బ్రహ్మతంత్రస్వతంత్రస్వామి శ్రీరామానుజ దర్శనాన్ని ప్రవర్తింపజేసిన విషయాన్ని **"హస్తీశం లోకవిఖ్యాతం కౌండిన్యం విదుషాంతరమ్, రామానుజార్యసిద్ధాంతస్థాపనాచార్యమాశ్రయే"** అని అంటూ ప్రస్తుతించింది. శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామినుండి ఆరంభమైన వేదాంతదేశికులకు చెందిన సిద్ధాంతగురుపరంపర పరకాలమఠంలో ఈనాటికీ 700 సంవత్సరాల తరువాత కూడా అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నది. పరకాలమఠ దివ్యసింహాసనం ఇప్పటివరకు 36 మంది జీయర్‌స్వాములచే అలంకరింపబడింది. వీరందఱు గొప్పగొప్ప విద్వాంసులు. శ్రీమన్నిగమాంతమహాదేశికుల పాదచ్ఛాయలో ఉజ్జీవించి, ప్రవర్తించిన మహనీయులు.

(ఇక్కడ తెలుపబడ్డ వివరాలను "ఎపిగ్రాఫికా ఇండికా" సంపుటం-XXiv, భాగం-Vii, జూలై, 1940వ సం॥లో ప్రచురింపబడిన గ్రంథంలోని పే. 318-326 పేజీలలో గమనించవచ్చు.)

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమదభినవరామానుజబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల స్వామినే నమః

# ధర్మవరం పరకాలమఠాన్ని గూర్చి

జి.కృష్ణమూర్తి అనే నన్ను పరకాలమఠానికి అధ్యక్షునిగా భాగవతులు అందరూ ఎన్నుకొన్నారు. రెండు నెలల తర్వాత మా ఆచార్యుల తిరునక్షత్రం సందర్భంలో ధర్మవరంలో ఎన్నడూ లేనివిధంగా భాగవతతదీయారాధన మా ఆచార్యస్వామివారు చేయించుకొన్నారు. కొన్నిరోజుల తర్వాత అందరం కలసి పరమాచార్యులైన శ్రీరంగనాథ స్వామివారి తిరునక్షత్రంనాడు కూడా తదీయారాధనం విశేషంగా జరిగితే బాగుండునని భావించి, పదివేల రూపాయలను శాశ్వతనిధిగా అందరం కలసి ఏర్పాటుచేసుకొన్నాము. అప్పటి నుండి ఈ రెండు తిరునక్షత్రము లకు భాగవతతదీయారాధన విశేషంగా జరుగుతున్నది. కొన్నిదినాల తర్వాత శ్రీయిడుగూరు తాతయ్యగారు నన్ను హిందూపురానికి పిలిచి శ్రీరంగనాథస్వామివారు ధర్మవరంలో పరకాలమఠాన్ని ఏర్పాటుచేయవలెనని పలికినట్లు తెలిపారు. కొన్నిరోజుల తర్వాత వారు కాలినడకతో మాగ్రామానికి వచ్చారు. అప్పటినుండి పరకాలమఠానికి తగిన భవనం కోసం అన్వేషిస్తూ ఉన్నాము. నేను పరకాల మఠం ట్రస్ట్‌బోర్డు మెంబరుగా 13 ఏడ్లు ఉన్నాను. ఒకసారి మీటింగ్ నిమిత్తం మైసూరుకు వెళ్ళినప్పుడు మా ఆచార్యులు అభినవ రామానుజ స్వామివారితో కలసి ధర్మవరంలో పరకాలమఠస్థాపనవిషయం గురించి చర్చించాము. అప్పుడు వారు శ్రీలక్ష్మీహయ గ్రీవుల మందిరం రాజవీథిలో ఉండాలని, మేము శిష్యసమేతంగా మీ ఊరికి వస్తే మాతోవచ్చే సుమారు 50మంది భాగవతులకు తగిన వసతి సౌకర్యాలుండాలని లక్ష్మీహయగ్రీవుల ఆరాధనకు తగిన సౌకర్యాలుండాలని, అటువంటి గృహాన్ని చూడమని ఆజ్ఞాపించారు. అప్పుడు రాత్రి 12.30 గంటల సమయం. అటువంటి గృహం మఠంకోసం దొరకడం అసాధ్యమని నాకు తోచి ఆవిషయాన్ని స్వామికి విన్నవించాను. అప్పుడు ఆచార్యులవారు 20 నిమిషములు హయగ్రీవులను ధ్యానించి నాకు మంత్రాక్షతలను, ఇచ్చి నీకార్యము సఫలమవుతుందని అనుగ్రహించారు. నేను ఊరికి రాగానే మఠానికి తగిన గృహం అమ్మకానికి ఉన్నదని నాకుమారుడు చి॥ కొండయ్యద్వారా తెలిసికొని దానిని కొన్నాను. అప్పటి నుండి ఆ గృహం పరకాలమఠంగా నిర్వహింపబడుతున్నది. తరువాత శ్రీస్వామివారు ధర్మవరానికి వచ్చి నిండుహృదయంతో మఠానికి మంగళాశాసనం చేశారు. అప్పటి నుండి శ్రీస్వామి అనుగ్రహంతో మఠం దినాదినాభివృద్ధి చెందుతున్నది. మఠంలో అన్ని కార్యక్రమములు దిగ్విజయముగా జరుగుతున్నవి.

ఇట్లు, భాగవతదాసుడు,
**జి.కృష్ణమూర్తి**



# శ్రీమన్నిగమాంతమహాదేశికులు

## (ప్రథమాచార్యులు)

శ్రీమద్వేదాంతదేశికులు శ్రీవేంకటేశ్వరుని ఘంటయొక్క అంశతో అవతరించారు. వీరు నమ్మాళ్వార్లకు, భగవద్రామానుజులకు తరువాత పరమవైదిక మైన శ్రీవైష్ణవసంప్రదాయనిర్వాహకాగ్రేసరులుగా పేరు పొందారు. శ్రీదేశికులు ప్రపంచ ప్రసిద్ధి చెందిన గొప్ప మేధావులలో ఒకరుగా, గొప్ప ఆచార్యులలో ఒకరుగా పరిగణింపబడుతున్నారు.

శ్రీదేశికులు తూప్పుల్ అగ్రహారంలో అనంతసూరి, తోతారాంబ పుణ్య దంపతులకు కుమారుడుగా క్రీ.శ. 1268వ సం॥లో భాద్రపద (కన్యా) మాసం శ్రవణా నక్షత్రంలో అవతరించారు. శ్రీనివాసుని జన్మనక్షత్రంకూడా శ్రవణమే. జన్మతః మేధావి అయిన వీరు శ్రీరామానుజులు స్థాపించిన 74 మంది సింహాసనాధిపతులలో ఒక సింహాసనాధిపతి వంశానికి చెందినవారు. అయిదు సంవత్సరాల చిన్న వయస్సులోనే వీరి అపార ప్రతిభను చూచిన నడాదూర్ అమ్మాళ్ (శ్రీవాత్స్య వరదగురువులు) వీరిని ఆశీర్వదించారు. అమ్మాళ్ నియమనాన్ని అనుసరించి, దేశికుల మేనమామ అయిన ఆత్రేయ రామానుజా చార్యులవారు (అప్పుళ్ళార్) దేశికులకు పంచసంస్కారాదు లను చేసి, సామాన్యవిశేషశాస్త్రాలను నేర్పించారు. వాటిలో అనతికాలంలోనే దేశికులు అసమానమైన పాండిత్యాన్ని గడించారు. వినయంలో, శ్రద్ధాభక్తులలో అద్వితీయులుగా పేరు పొందారు. తిరువహీంద్ర పురంలోని శ్రీహయగ్రీవస్వామి సాక్షాత్కారాన్ని పొందారు. అప్పుళ్ళార్ ఆశీస్సులతో శ్రీలక్ష్మీ హయగ్రీవమూర్తి అర్చావిగ్రహాన్ని కూడా పొందారు. ఈ అర్చామూర్తినే సరస్వతీదేవి కాశ్మీరదేశంలో భగవద్రామానుజుల శ్రీభాష్యాన్ని ప్రశంసించి, వారికి ఇచ్చింది.

శ్రీదేశికులు కాలక్రమేణ తమకు అన్నివిధాల అనురూప అయిన కనకవల్లి అనే కన్యారత్నాన్ని వివాహమాడి గృహస్థాశ్రమంలో ప్రవేశించారు. ఎక్కువ కాలం కాంచీపురం, తిరువహీంద్రపురం, శ్రీరంగం, తిరునారాయణపురం, తిరుమల, క్షేత్రాలలో గడిపారు. ఆసేతుహిమాచలం పలు దివ్య దేశాలను సేవించి, అచటి అర్చామూర్తులకు మంగళాశాసనం చేశారు.

విలక్షణ జ్ఞానవైరాగ్యానుష్ఠాన సంపన్నులైన శ్రీదేశికులు ఉంఛవృత్తితోనే ఉదరపోషణను చేసికోవడం విశేషం. శ్రీసుదర్శనభట్టర్ శ్రీరామానుజుల శ్రీభాష్యంపై రచించిన శ్రుతప్రకాశికా అనే అపూర్వమైన, అమూల్యమైన వ్యాఖ్యను రక్షించారు. 130 సంఖ్యకు మించిన పలు కృతులలో రచించారు. వీటిలో స్తోత్ర - కావ్య - నాటక - వేదాంతగ్రంథాలు, రహస్యగ్రంథాలు, వ్యాఖ్యానాలు, వాద గ్రంథాలు, ద్రావిడ - సంస్కృత-ప్రాకృత - మణిప్రవాళ భాషలలో రచింపబడిన గ్రంథాలు ఎన్నో ఉన్నాయి. పండితవాదాలద్వారా, వాదగ్రంథాలద్వారా వేదవిరుద్ధాలైన వాదాలను జయించి శ్రీరామానుజసిద్ధాంతాన్ని అవిచాల్యంగా, అప్రతిహతంగా సుస్థాపించారు. దేశికులు సంప్రదాయరక్షణకోసం అవతరించిన దివ్యపురుషులని వారికంటే పెద్దలు, తరువాత తరంవారు ఈనాటివరకు అందఱు సంభావిస్తున్నారు. వారు ఈ విభూతిలో జీవించి ఉండగా వారిని అన్య సంప్రదాయతత్త్వవేత్తలు, కవులు సైతం మహా విద్వాంసులుగా, మహాకవులుగా గౌరవించారు. విద్యారణ్యస్వామి, డిండిమభట్టు, శ్రీకృష్ణమిశ్రులు, అప్పయ్య దీక్షితులువంటి మహావిద్వాంసులు దేశికులపట్ల చూపిన గౌరవం వీరి పాండిత్యాన్ని, ఆత్మగుణసంపత్తిని నిరూపిస్తున్నాయి. వీరి శిష్యులు, భక్తులు వీరిని ఆచార్యునిగా, దైవంగా, ప్రాప్యంగా, ప్రాపకంగా, కులధనంగా కొలుస్తారు.

శ్రీరామానుజుల ఉపదేశాలవల్ల ప్రపత్తి అనేది తప్పక మోక్షాన్ని అనుగ్రహించే ఉపాయంగా తెలుస్తున్నదని దేశికులు దృఢంగా నిరూపించారు. శ్రీదేశికుల కృతులన్నీ దైవభక్తిని, భగవత్సన్నిధిలో ఆత్మరక్షణభారసమర్పణ రూపమైన న్యాసాన్ని ప్రబోధిస్తాయి. బద్ధజీవులందఱు ఉన్నతస్థానాన్ని అధిరోహించి పరమానందాన్ని పొందడంకోసం ఆవశ్యకమైన సులభ సోపానాలను శ్రీదేశికుల నిర్మించారని అనడంలో సందేహం లేదు. వీర రచనలలో శిఖరాయమాణంగా చెప్పదగినది- శ్రీమద్రహస్య త్రయసారం. దీనిలో శ్రీదేశికుల జ్ఞానపరీపాక వైలక్షణ్యం గోచరిస్తుంది. **"సర్వతంత్రస్వతంత్ర, కవితార్కికసింహ, వేదాంతాచార్య, సమస్యాసహస్రి, భగవద్రామానుజ సిద్ధాంతనిర్ధారణ సార్వభౌమ"** మొదలైన పలు బిరుదులను వీరు పొందారు. తమ అసాధారణమేధాపటిమతో అసమానపాండిత్య గరిమతో దేశికులు శ్రీరామానుజ సంప్రదాయప్రచార, పరిరక్షణలకోసం ఎనలేని కృషిచేశారు. వీరి శిష్యులు అందఱు సమర్థులై వెలిగారు. వీరి కుమారులైన కుమారవరదాచార్యస్వామి వారు, బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల జీయర్‌స్వామి



వారు (మొదటిపట్టం), కొమాండూర్ ఆచ్చాన్, తీర్థప్పిళ్ళై, తిరుమలై శ్రీనివాసాచార్య, కుంజాంబూర్ రామానుజాచార్య, కందాడై ఎంబార్, తిరుమలై నల్లాన్, కిడాంబి పిళ్ళై, తూప్పుల్ అప్పై మొదలైనవారు. వారిలో కొందరు ఎంతోమంది చక్రవర్తులు, సామంతులు వీరి శ్రీచరణాశ్రయణాన్ని చేసిన భాగ్యాన్ని పొందారు.

శ్రీదేశికులు క్రీ.శ.1369 సం॥లో నూఱు సంవత్సరాల వయస్సులో ఆచార్య శ్రీచరణసన్నిధిని చేరారు. అవతారసమాప్తిసమయంలో తాము ఆరాధించిన శ్రీలక్ష్మీహయగ్రీవస్వామి అర్చామూర్తిని మొదటి బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల స్వామివారికి అనుగ్రహించారు. తమకు పితృపైతామహధనంగా లభించిన వరదరాజస్వామి అర్చావిగ్రహాన్ని తమ కుమారులైన కుమారవరదాచార్య స్వామివారికి ఇచ్చారు. శ్రీదేశికులు గొప్ప కవి, తత్త్వవేత్త. వారు ఒక వ్యక్తి కాదు, సంస్థ - అని చెప్పాలి. కాంచీపురంలో క్రీ.శ.1360 సం॥లో వారు ఏర్పాటు చేసిన సంస్థయే ప్రస్తుత పరకాలమఠానికి నాంది. ఈ సంస్థను తమ శిష్యులైన బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామి వారి (మొదటి వట్టం) ద్వారా స్థాపించారు. శ్రీదేశికుల తనియన్ శ్లోకాలను వారి కుమారులైన కుమారవరదాచార్యస్వామివారు, బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామివారు (మొదటి పట్టం) అనుగ్రహించారు.

1) శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

2) కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే ।
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః ॥

3) రామానుజదయాపాత్రం జ్ఞానవైరాగ్యభూషణమ్ ।
శ్రీమద్వేంకటనాథార్యం వందే వేదాంతదేశికమ్ ॥

4) అఖిలభువనరక్షాసాధనాయావతీర్ణే
సుమతికవివిలాసధ్వాంతతిగ్మాంశుజాలే ।
నిరవధికరుణాబ్ధౌ వేదచూడాగురౌ మే
భవతు పరమభక్తిః శ్రీనిధౌ వేంకటేశే ॥

# శ్రీకుమార వరదనాథ నాయనారాచార్య మహాదేశికులు
# (భగవద్విషయ కాలక్షేపాచార్యులు)



(1315-1413)

శ్రావణే మాసి రోహిణ్యాం జాతం వేంకటదేశికాత్ ।
విశ్వామిత్రాన్వయాబ్ధీందుం వరదార్యమహం భజే ॥

(శ్రావణమాసం రోహిణీ నక్షత్రంలో శ్రీవేదాంతదేశికులకు జన్మించినవారు, విశ్వామిత్రకులమనే సముద్రాన్ని ఆనందింపజేసే చంద్రునివంటివారైన శ్రీవరదాచార్య స్వామిని భజిస్తున్నాను)

శ్రీవేదాంతదేశికులకు ఒకనాడు స్వప్నంలో కంచి వరదరాజస్వామి సాక్షాత్కరించి, తాను తన అంశతో ఒక కుమారుని ప్రసాదిస్తున్నానని తెలిపాడు. ఆ పుత్రునకు తన పేరు పెట్టమనికూడా అన్నాడు. వరదరాజస్వామి పల్కిన మాట ప్రకారం శ్రీదేశికులకు కలియుగారంభమై 4418వ సంవత్సరం నలవర్షంలో శ్రావణ మాసం రోహిణీనక్షత్రంలో ఒక కుమారుడు జన్మించాడు. ఆ కుమారునకు వరదనాథులనే పేరును పెట్టి, సకాలంలో జాతకర్మ - నామకరణ - అరక్షభ్యాస, చౌలోపనయనాది సంస్కారాలను చేశారు. క్రమంగా వేదవేదాంగాలను, తిరు



మంత్రార్థాన్ని, పలుశాస్త్రాలను బోధించారు. వరదరాజస్వామి అంశతో అవతరించిన వరదనాథులు చిన్నతనంనుండి తమ అద్వితీయప్రతిభాపాటవాన్ని ప్రదర్శించారు. విషయగ్రహణధారణలో తమ అసాధారణసామర్థ్యాన్ని వ్యక్తం చేశారు.

కలియుగాది **4430** వ సం. విభవ వర్షం, చైత్రమాసం పునర్వసు నక్షత్రంలో వరదనాథులు తమ శ్రీభాష్యకాలక్షేపాన్ని తమ పితృపాదులు శ్రీవేదాంత దేశికుల సన్నిధిలో ఆరంభించారు. అంతకుముందే ప్రథమ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలజీయర్ స్వామి శ్రీదేశికులనుగూర్చి తనియన్ శ్లోకాలను అనుగ్రహించారు. అంతవరకు ఆ శ్లోకాలు శ్రీభాష్యగ్రంథకాలక్షేపం ఆరంభసమయంలో అనుసంధింప బడేవి. ఆ శ్లోకాలు ఏవి? అంటే -

నమఃపద మిదం భూయాత్ తస్మై వేంకటసూరయే ।
యద్వాగమృతసేకేన సంజీవిత మిదం జగత్ ॥
భగవంత మివానంతకల్యాణగుణసాగరమ్ ।
వేదాంతదేశికం నౌమి వేంకటేశగురూత్తమమ్ ॥

శ్రీవరదనాథ నయనాచార్య స్వామివారు పైతనియన్‌లతో పాటు ఈ క్రింది ప్రసిద్ధమైన తనియన్‌ను శ్రీదేశికుల విషయంలో విన్నపించారు.

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతచార్యావర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

శ్రుతప్రకాశికాచార్యులవారైన శ్రీసుదర్శనభట్టర్ ఈ తనియన్ ఆనాటి నుండి శ్రీభాష్యకాలక్షేపారంభంలో నియతంగా అనుసంధింపబడాలని నియమించారు. శ్రీదేశికులు దీనిని పేరరుళాళన్ (వరదరాజస్వామి) అనుగ్రహవిశేషంగా భావించి శ్రీసుదర్శనభట్టర్ చేసిన నియమానికి తమ అంగీకారాన్ని తెలిపారు.

శ్రీరామానుజుల శిష్యులు పిళ్ళాన్ విషయంలో విశేషప్రతిపత్తిని కల్గి ఉన్నట్లే, శ్రీదేశికుల శిష్యులందరు వరదనాథులపట్ల విశేషప్రతిపత్తిని కల్గినవారు. కొంత కాలమైన తరువాత, మహమ్మదీయుల దండయాత్ర కారణంగా శ్రీదేశికులు శ్రీరంగాన్ని వదలి, సత్యకలక్షేత్రాన్ని సకుటుంబంగా చేరారు. అక్కడ కావేరీనదీ తీరంలో వరదరాజస్వామి ఆలయ సమీపంలో నివాసం ఏర్పరచుకొని, తమ శిష్యులకు శ్రీభాష్యాది గ్రంథాలను ప్రవచనం చేశారు. ఈ సమయంలోనే వరదనాథులు

తమ పితృపాదుల సన్నిధిలో పలు శాస్త్రాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. తరువాత వారు తిరునారాయణ పురాన్ని చేరారు. అక్కడ శ్రీదేశికులకు అనంతరం సంప్రదాయ ప్రవర్తకులుగా వరదాచార్యులవారిని నియమించాలని శ్రీరామానుజులు అర్చక ముఖంగా దేశికులను ఆజ్ఞాపించారు. తిరునారాయణ పురక్షేత్రంలోనే నయనవరదాచార్యులవారు శ్రీదేశికులవద్ద నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళి ఆఱాయిరప్పడి వ్యాఖ్యను అధ్యయనం చేశారు. తిరువాయ్‌మొళి ప్రబంధంపై శ్రీదేశికుల నిగమ పరిమళవ్యాఖ్యనుకూడా గ్రహించారు. (ఈ వ్యాఖ్య ఇపుడు లుప్తమైనది). ఈ సమయంలో ప్రథమ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి అక్కడే ఉన్న, వరదాచార్యులవారి తిరువాయమొళి ప్రబంధకాలక్షేప గోష్ఠిలో కలసి, అధ్యయనం చేయలేదు. దీనికిగల కారణాన్నిగూర్చి శ్రీదేశికులు వారిని ప్రశ్నించగా, శ్రీబ్రహ్మతంత్రస్వామి సమాధానం పల్కుతూ, వరదనాథులు భగవద్రామానుజులు విశేషమైన అనుగ్రహాన్ని పొందిన మహనీయులు కనుక, వారితో సతీర్థులై అధ్యయనం చేయడం అపచారం కాగలరనే ఉద్దేశ్యంతో వారితో కలసి అధ్యయనం చేయలేదని అన్నారు. వరదనాథులను ఆచార్యులుగా చేసికొని, తాము వారివద్ద తిరువాయ్‌మొళి ప్రబంధాన్ని అధ్యయనం చేయదలచినట్లు తెలిపి, అందుకు అనుమతించవలసినదిగా శ్రీదేశికులను వారు అర్థించారు. శ్రీదేశికులు అందుకు అంగీకరించారు.

కలియుగాది 4440 వ సం॥ బహుధాన్యవర్షం ఆవణి శ్రావణమాసం శుక్ల ద్వితీయ హస్తానక్షత్రంనాడు శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి శ్రీవరదనాథుల విషయంలో ఒక తనియన్ (ప్రార్థన) శ్లోకాన్ని విన్నపించి, భగవద్విషయకాలక్షేపాన్ని ఆరంభించారు. ఆ తనియన్ శ్లోకం ఏమి? అంటే

**శ్రీమల్లక్ష్మణయోగీంద్రసిద్ధాంత విజయధ్వజమ్ ।**
**విశ్వామిత్రకులోద్భూతం వరదార్యమహం భజే ॥**

శ్రీదేశికుల చరమదశలో, భగవద్రామానుజులు, శ్రీదేశికులకు తరువాత నయనవరదాచార్యులువారే సంప్రదాయప్రవర్తకులు కావాలనే తమ నిర్ణయాన్ని మళ్ళీ ప్రకటించారు. శ్రీనయనవరదాచార్యులవారు శ్రీదేశికులవద్దనుండి పంచ సంస్కారానికి ఉపయోగించే శంఖచక్రాలను, వరదరాజస్వామి అర్చామూర్తిని గ్రహించారు. శ్రీదేశికుల విషయంలో మంగళాశాసనాత్మకమైన ఈ క్రింది తనియన్‌ను కూడా విన్నపించారు.



**కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే ।**
**శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః ॥**

శ్రీదేశికులు ఆచార్యసన్నిధానాన్ని చేరిన తరువాత, నయనవరదాచార్యులవారు శ్రీదేశికుల ప్రధానశిష్యులతో కలసి శ్రీరంగంలోనే ఒక సంవత్సరకాలంపాటు ఉంటూ సంప్రదాయప్రచారాన్ని నిర్వహించాలని తలచి, తరువాత దిగ్విజయ యాత్రగా బయలుదేరి తిరుప్పేర్ అనే దివ్యక్షేత్రాన్ని చేరారు. అక్కడ పలువురు ప్రతివాదులను జయించారు. సర్వజ్ఞ సింగభూపాలుడు వీరిని విశేషంగా గౌరవించాడు. వరదనాథులు దిగ్విజయ యాత్ర కొనసాగిస్తూ గంగైకొండ చోళపురాన్ని చేరి, అక్కడ ప్రతివాద నిరసనాన్ని చేశారు. తరువాత తంజమామణికోయిల్ అనే క్షేత్రాన్ని చేరి అక్కడ అద్వైతులతో వాదించి గెలిచారు. అక్కడ కొంతకాలం నివాసం ఉండి, వ్యాఖ్యా గ్రంథాలు రచిస్తూ, శ్రీరామానుజసిద్ధాంతప్రవచనాన్ని చేశారు. నాలాయిర దివ్యప్రబంధంలో మొదటి సహస్రమైన ముదలాయిరమ్ చివరలో చరమపర్వనిష్ఠను ప్రతిపాదించే మధురకవుల కణ్ణినుణ్‌శిఱుత్తామ్బు ప్రబంధం చేర్చబడినట్లే, ఇయఱ్పా అనే తృతీయ సహస్రం చివరలో తిరువరఙ్గత్తముదనార్ కృపజేసిన ఇరామానుశ నూత్తన్దాది ప్రబంధం చేర్చబడినట్లే, శ్రీవరదనాథులు దేశికులకుగూర్చి పల్కిన, చరమపర్వనిష్ఠా ప్రతిపాదకమైన పిళ్ళై అన్దాది, దేశిక ప్రబంధం చివరలో చేర్చబడింది. ఈ ప్రబంధాన్ని వరదదేశికులు, మొదటి బ్రహ్మతంత్రస్వతంత్రస్వామి నీలమేఘప్పెరుమాళ్ సన్నిధిలో అనుసంధించారు.

తరువాత తిరుక్కోటియూర్‌కు, తిరుమాలిరుమ్ శోలై క్షేత్రాలను దర్శించి మధురను చేరారు అక్కడ జరిగే **"పరతత్త్వనిర్ణయోత్సవాన్ని"** కొంతమంది అన్యమతస్థులు అడ్డుకోగా, వరదనాథులు వారితో వాదించి, ఓడించి, ఆ ఉత్సవం సక్రమంగా జరిగే ఏర్పాట్లను చేయించారు. అక్కడ, శ్రీవిల్లిపుత్తూర్‌లో ఆళ్వార్ తిరునగరిలో శ్రీదేశికుల అర్చావిగ్రహాలను ప్రతిష్ఠించారు. ఆ పిమ్మట కేరళలోని దివ్యదేశాలను సేవించారు. అక్కడ కొంతమంది క్షుద్రులైన మాయావాదులు మడప్పళ్ళి కైంకర్యానికి విఘ్నం కల్గిస్తూ ఉండేవారు. శ్రీనయనవరదాచార్యులవారు వారిని తమ యోగశక్తితో జయించి, వారి శక్తి నిర్వీర్యం చేశారు. ఆ మాయావాదులు వరదనాథులను క్షమించమని ప్రార్థించారు.

వరదనాథులు తరువాత తిరునారాయణపురాన్ని చేరారు. అక్కడ దేశికుల అర్చావిగ్రహాన్ని ప్రతిష్ఠించి, కొంతకాలంపాటు సంప్రదాయప్రవచనాన్ని ఆ క్షేత్రంలో

చేశారు. వారు తిరునారాయణపురంలో ఉండగా, ఒక పంగునిమాసం ఉత్తరానక్షత్రం నాడు యదుగిరినాచ్చియార్, తిరునారాయణన్ స్వామి కలసి వేంచేసి ఉండే సమయంలో "ఎన్నదు యాన్ శెయ్‌కిన్టేన్" అనే పాశురాన్ని విన్నపించారు. శ్రీబ్రహ్మతంత్రస్వామి "నిన్నరుళాన్ కడియన్టి మత్తొన్టిలేన్" అనే పాశురాన్ని పలికారు. అపుడు భగవానుడు అర్చకముఖంగా "మీ ఈ పాశురాలను ఆలకించిన నాకు చాలా ఆనందం కల్గింది. ఈ పాశురాలు భగవద్రామానుజులు గద్యత్రయం లోని అర్థాన్ని తెల్పుతున్నాయి. ఇవి ఈ పంగుని ఉత్తరానక్షత్రంలో విన్నపింపబడ్డాయి. అందువల్ల నేను మీకు వరాన్ని అనుగ్రహించదలచాను. మీ అభీష్టాన్ని తెలుపండి" అని అన్నాడు. శ్రీవరద నాథులపుడు - "స్వామీ! ఈనాడు నీ సమక్షంలో దేశిక ప్రబంధాన్ని పూర్ణంగా అనుసంధింపబడాలి. నీవు దానిని ఆలకించాలి" అని అన్నారు. వారి కోరికను దివ్యదంపతులు ఆనందంగా అంగీకరించగా అరైయర్ దేశిక ప్రబంధాన్ని గానం చేశారు.

కొంతకాలం గడచిన తరువాత వరదనాథులు శ్రీరంగానికి తిరిగి వచ్చారు. ఒక పర్యాయం భాద్రపదమాసం (పురట్టాశి) శ్రవణానక్షత్రంనాడు శ్రీవరదాచార్యుల వారు దేశికుల తిరునాళ్ పాట్టును గానం చేశారు. తరువాత ఉత్తరదేశదివ్యక్షేత్రాలను దర్శించగోరి బయలు దేరారు. దారిలో పలుచోట్ల అన్యమతవాదులతో వాదించి, గెలిచి, శ్రీరామానుజమతాన్ని సుస్థాపించారు. యాత్రనుండి తిరిగి వచ్చి తిరువహీంద్ర పురాన్ని చేరి అక్కడ ఔషధగిరిలో దేశికుల అర్చామూర్తిని ప్రతిష్ఠించారు. ఇక్కడే శ్రీదేశికులు గరుడభగవానుని అనుగ్రహాన్ని, లక్ష్మీ హయగ్రీవుల కృపను పొందారు. అచటి దివ్యాలయంలో నెలకొని ఉండే దైవనాయకస్వామి అనుగ్రహాన్ని కూడా దేశికులు పొందారు. తరువాత తిరుక్కోవలూర్‌కు, మధురాంతానికి పోయి, చివరగా కాంచీపురాన్ని చేరారు. అక్కడ వరదరాజస్వామి వారితో ఆనందంగా "దేశికులకు నేను సాక్షాత్కరింపజేసిన స్వప్నం ఫలించింది'' అని అన్నాడు. వరదాచార్యులవారు తరువాత తిరుత్తణ్కా క్షేత్రంలోని తమ నివాసాన్ని చేరి, అక్కడ దీపప్రకాశ స్వామి సన్నిధికి దగ్గరగా దేశికుల దివ్యాలయాన్ని నిర్మించి, ప్రతిష్ఠాదులను చేసి, నిత్యారాధనకు తగిన ఏర్పాట్లను చేశారు.

ఆ కాలంలో కంచి వరదరాజస్వామికి జరిగే తిరువీధి ఉత్సవంలో ఆళ్వారుల దివ్యప్రబంధానుసంధానం చేయబడడాన్ని కొందఱు కుమతులు ప్రతిఘటించగా,



వారితో వరదాచార్యులవారు వాదించి వారిని జయించి, దివ్యప్రబంధం అనుసంధింప బడేటట్లు చేశారు. వరదాచార్యులవారి ఈ నిర్వాహాన్ని చూచి సంతోషించిన గరుడా రూఢుడైన వరదరాజస్వామి అర్చక ముఖంగా, వరదాచార్యస్వామివారిని శఠారి, నిర్మాల్యాదులతో గౌరవించవలసినదిగా ఆజ్ఞాపించాడు. వరదాచార్యులవారు అపుడు "మా ఆచార్యులైన దేశికులు చేసిన కైంకర్యాలతో పోలిస్తే ఇది చాలా చిన్నది" అని చాలా వినయంగా పలికారు. వరదరాజస్వామి మఱింత సంతోషించి, ఆ మర్యాదలను శ్రీదేశికుల అర్చామూర్తికి జరుపవసినదిగా తెలిపాడు. ఈ క్రమం ఈనాటికీ పాటింపబడడాన్ని గమనించవచ్చు.

వరదాచార్యులవారు తరువాత కాంచీపురం ఆలయంలో దేశికుల అర్చా విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. పిమ్మట శ్రీ పెరుంబూదూర్‌కు చేరి అక్కడక్కడా దేశికుల విగ్రహప్రతిష్ఠాపనను చేసి, తిరుమలకు చేరి పద్మావతీసమేత శ్రీనివాసస్వామికి మంగళాశాసనాన్ని చేసి, అహోబల క్షేత్రాన్ని దర్శించారు. ఇక్కడ వరదాచార్యస్వామి వారిని సర్వజ్ఞ సింగప్పనాయుడు గౌరవించాడు. ఆ కాలంలో అక్కడ శాకల్యమల్లుడనే మాంత్రికుడు ఉండేవాడు. అతని అధీనంలో ఒక బ్రహ్మరక్షస్సు ఉండేది. శాకల్య మల్లుడు ఈ బ్రహ్మరక్షస్సు ద్వారా వరదాచార్యస్వామివారు వేంచేసే పల్లకిని తన మంత్రశక్తితో కదలనీయకుండా చేశాడు. దీనిని గమనించిన వరదాచార్యస్వామి వారు తమ మంత్రసిద్ధితో బ్రహ్మరక్షస్సు ప్రభావాన్ని లేకుండాచేసి, తమ పల్లకిని ఆ బ్రహ్మరక్షస్సు మోసేటట్లు చేశారు. అంతటితో శాకల్యమల్లుని గర్వం తీరింది. అతడు వరదాచార్యస్వామిని క్షమాభిక్ష వేడాడు.

గోదావరీనదీతీరంలో శ్రీస్వామి దాశరాజు అనే బ్రాహ్మణుని కలిశారు. అతనిని శ్రీవైష్ణవునిగా చేసి దాశరథి రాజు అనే పేరు అతనికి పెట్టారు. అతనికి శ్రీదేశికుల విగ్రహాన్ని ఇచ్చి ప్రతిదినం ఆ మూర్తిని ఆరాధించమని ఆదేశించారు. అతని ప్రార్థనపై శ్రీవరదాచార్యులవారు సారార్థసంగ్రహంవంటి కొన్ని కృతులను రచించి వాటిని తమ శిష్యులకు బోధించారు. తమ ఉత్తరదేశయాత్రను పూర్తిచేసికొని కాంచీపురాన్ని చేరారు. అక్కడ అగ్నిష్టోమయాగాన్ని నిర్వహించారు. శ్రీవరదాచార్య స్వామివారివంశం యజ్ఞయాగాది నిర్వహణలో ప్రసిద్ధమైనదికదా!

ఈ సమయంలోనే వరదాచార్యులవారు అధికరణచింతామణివంటి గ్రంథాలను వెలయించారు. శాకల్యమల్లునిచే ప్రేరేపింపబడిన ఒక మాయావాది

సన్యాసి వరదాచార్యులవారి దగ్గరకు వచ్చి "మీరు నన్ను జయించిన తరువాత మీ సిద్ధాంతాన్ని ప్రవచించండి" అని సవాలు చేశాడు. అపుడు వరదాచార్యులవారు అతని గర్వాన్ని శ్రీదేశికుల అనుగ్రహంతో, వరదరాజస్వామి కృపతో భగ్నం చేయదలచారు. చిర కాలంగా తమకు కైంకర్యం చేసే శిష్యుల్లో ఒకరైన అణ్ణన్‌ని పిలిచి, హయగ్రీవమంత్రంతో పవిత్రమైన జలాన్ని వారికి ఇచ్చి, స్వీకరింపజేసి, వారిని ఆ మాయావాదితో వాదించమని ఆజ్ఞాపించారు. అణ్ణన్ ఆ విధంగా ఆ మాయావాదితో వాదించి అతనిని ఓడించారు. మాయావాది అణ్ణన్‌కు నమస్కరించి, వరదాచార్యులవారి వద్దకు వచ్చి క్షమను అర్థించారు. వరదాచార్యులవారు అణ్ణన్ విషయంలో చాలా సంతుష్టులై, వారిని" **"ప్రతివాదిభయంకరమ్ అణ్ణనే! వారుమ్"** అని ఆదరంగా పిలిచారు. అపుడు అణ్ణన్ **"సప్తతిరత్నమాలిక"** అనే స్తుతిని దేశికులను కీర్తిస్తూ రచించారు. వరదాచార్యులవారి నియమనంతో అణ్ణన్ శ్రీరంగాన్ని చేరి అక్కడ సిద్ధాంత ప్రవచనాన్ని , ప్రచారాన్ని సాగించారు.

ఒకనాడు వరదాచార్యస్వామి కంచి వరదరాజస్వామికి దర్శించినపుడు, భగవానుడు వారితో "మీరు త్వరలో పరమపదాన్ని పొందగలరు" అని అన్నాడు. ఆ విధంగా భగవదాజ్ఞను పొందిన శ్రీస్వామి తమ చరమోప దేశాలను శిష్యులకు చేసి, శ్రీదేశికుల శ్రీపాదతీర్థాన్ని గ్రహించారు. తమ శ్రీపాదతీర్థంతో శిష్యులను అనుగ్రహించారు. తమకు శ్రీదేశికులు అనుగ్రహించిన వరదరాజస్వామి అర్చామూర్తిని తమ శిష్యులైన ఎమ్బెరుమానార్ అప్పన్‌కు ఇచ్చారు. తిరువాయ్‌మొళి దివ్యప్రబంధం, ఉపనిషత్తులు అనుసంధింపబడుతూ ఉండగా శ్రీవరదనాథ మహాదేశికులు స్వాచార్యశ్రీచరణ సన్నిధిని జయనామసంవత్సరం పంగుని మాసం కృష్ణపక్ష సప్తమీతిథిలో చేరారు. తిరుమలై శ్రీనివాసాచార్యులవారి కుమారులు, పెరుమాళ్ కోయిల్ శ్రీకార్యకర్తలైన తిరుమలై అప్పర్ ఆజ్ఞానుసారం ఎమ్బెరుమానార్ అప్పన్ వరదనాథుల చరమకైంకర్యాలను నిర్వహించారు.

శ్రీవరదనాథ నయనాచార్యులవారు అనుగ్రహించిన గ్రంథాలు - దేశిక మంగళాశాసనం, దేశికప్రార్థనాశతకం, దేశికప్రపత్తి, దేశికదినచర్య, దేశిక విగ్రహ ధ్యానం, పిళ్ళై అన్దాది. ఇవి అన్నీ దేశికులను ఉద్దేశించి రచింపబడినది.

సారార్థసంగ్రహం, అభయప్రదానసారం, విరోధిభంజని, ప్రధానసారం, తత్త్వత్రయచుళకం, రహస్యత్రయచుళకం, ఆహారనియమం (సంస్కృత గ్రంథం), న్యాసతిలకవ్యాఖ్యానమ్, సగుణబ్రహ్మసమర్థనం, శంకాకతకమ్, అభేద ఖండనమ్, అవిద్యాఖండనమ్, త్యాగశబ్దార్థనిర్ణయమ్, తత్త్వముక్తాకలాపశాంతి, అధికరణ చింతామణి, మీమాంసాపాదుకాపరిత్రాణం, హరిణసందేశం, కోకిలసందేశం - మొదలైనవి సంప్రదాయానికి చెందినవి.



ప్రభువులనుండి యతులవరకు పలువురు వీరికి శిష్యులయ్యారు. ప్రధాన శిష్యులు - ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్, కందాడై అణ్ణన్, కొమాండూర్ ఆచ్చాన్, పాలిపాక్కమ్ నాయినార్, తిరుమలై అప్పర్, కిడాంబి అప్పర్, నడాదూర్ ఆళ్వాన్, అనంతప్పన్, కందాడై అప్పన్, ఎమ్బెరుమానార్ అప్పన్. శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామివారుకూడా వీరివద్ద భగవద్విషయాన్ని అధికరించినందువల్ల వారి శిష్యులుగా పరిగణించవచ్చు.

తృతీయ బ్రహ్మతంత్రరకాలస్వామివారు నయనవరదాచార్య స్వామివారి వాళిత్తిరునామాన్ని అనుగ్రహించారు.

శ్రీదేశికులు పలు దివ్యదేశాలలోని అర్చామూర్తులను స్తుతించినా, కంచి వరదరాజస్వామివిషయలో విశేషమైన ప్రతిపత్తిని కలిగిఉండేవారు. అందువల్లనే వరదరాజస్వామి అంశతో వరదాచార్యులవారు దేశికులకు కుమారులుగా అవతరించారు. వరదరాజస్వామి వరదాచార్యులవారి రూపంలో దేశికులను తండ్రిగా వరించారు. ఇంతేకాదు, దేశికులను తాను 'ఆచార్యులుగా వరించిన గౌరవం కలిగేటట్లు అనుగ్రహించదలచి, వరదనాథులరూపంలో అవతరించి, స్వామిని ఆశ్రయించి శిష్యులయ్యాడనికదా పెద్దల సూక్తి.

దేశికుల, వరదనాథుల కృతులు పరస్పరపరిపూరకాలని చెప్పవచ్చు. దేశికులు వరదరాజస్వామిని ఉద్దేశించి న్యాసదశకంవంటి చాలా గొప్ప స్తుతులను రచించి, వాటిద్వారా వరదరాజస్వామిసన్నిధిలో శరణాగతిని చేశారు. నయనవరదాచార్య స్వామి వారు రచించిన పలు గ్రంథాలు దేశికులను ఉద్దేశించి రచింపబడినవే. వీటి ద్వారా వరదాచార్యస్వామివారు దేశికుల వైభవాన్ని స్తుతించి, వారి శరణాగతి చేశారు.

శ్రీదేశికులు వరదరాజస్వామిని శరణాగతిని చేస్తూ పది శ్లోకాలను కల న్యాస దశకమనే స్తుతిని విరచించగా, వరదనాథులు అంతదూరం పోకుండా, పది శ్లోకాలతో దేశికుల ప్రపత్తిని చేశారు. నయనవరదచార్యులవారి ఆచార్యభక్తి అపరిమితం. శ్రీదేశికులను వారు తండ్రిగా, తల్లిగా, ఆచార్యునిగా, దైవంగా భావించారు. తమ

ఆచార్యులైన దేశికులు తప్ప ఇంకొక లోకం కాని, దైవం కాని వరదాచార్యులవారు తెలియరు. సంసారసముద్రంనుండి తమను దరిచేర్చగల్గిన నావికునిగా దేశికులను సంభావించారు. ఈనాడు పలు దివ్యదేశాలలో, అభిమానస్థలాలలో దేశికుల అర్చామూర్తి దర్శన మిస్తున్నది అంటే, ఆ మూర్తికి ఆరాధన జరుగుతున్నది అంటే, అది నయనవరదాచార్యులవారి నిరంతరమైన, అప్రతిహతమైన, కృషిఫలమనే చెప్పాలి.

నయనవరదాచార్యులవారి కల్యాణగుణాలన్నిటిలో ఆచార్యభక్తి ప్రధాన మైనది. వీరు క్రీ.శ.1315 సం. నుండి క్రీ.శ.1413వ సం॥ వరకు ఈ విభూతిలో సుమారు నూటేండ్లు వేంచేసి ఉన్నారు. మొదటి బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల స్వామివారితో, దేశికుల శిష్యులతో కలసి వీరు శ్రీదేశికుల కృతుల సంరక్షణాన్ని, ప్రచారానికి అంతు లేని కృషిచేశారు. వీరిని **"శ్రీమల్లక్ష్మణయోగీంద్రసిద్ధాంత విజయధ్వజం"**గా, **"విశ్వామిత్రాన్వయాబ్ధీందుగా"** కీర్తించడం చాల అర్థవంతం.

తూప్పుల్ అగ్రహారంలో నయనవరదాచార్య స్వామివారి సన్నిధి ఉన్నది. పరకాల మఠంలోకూడా వీరి అర్చామూర్తి ఆరాధింపబడుతున్నది.





# 1) ప్రథమ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలమహాదేశికులు



(ఆస్థాన నిర్వాహం - 1386-1394)

శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్రపరకాల జీయర్‌స్వామివారు (మొదటి పట్టం) పూర్వాశ్రమంలో **"వీరవల్లి పేరరుళాళయ్యన్"** అని, **"హస్తీశర్"** అనే పేర్లతో ప్రసిద్ధులు. వీరు క్రీ.శ.1286వ సం॥లో కౌండిన్య గోత్రంలో పుట్టారు. కాంచీపురంలో శ్రీదేశికుల వలెనే పురట్టాశి (భాద్రపద) మాసం శ్రవణానక్షత్రంలో అవతరించారు.

వీరు చిన్నవయస్సునుండి గొప్ప మేథాశక్తిని కలవారు. చాలా చిన్నతనంలోనే, అప్పటికే గొప్ప విద్వాంసులుగా పేరు పొందిన శ్రీవేదాంతదేశికుల శ్రీచరణాలను కాంచీపురంలో ఆశ్రయించారు. వారి సన్నిధిలోనే పలు శాస్త్రాలను, పూర్వాచార్య గ్రంథాలను క్షుణ్ణంగా అభ్యసించారు. ఈ సమయంలోనే శ్రీపేరరుళాళయ్యన్ శ్రీభాష్యకాలక్షేపాన్ని దేశికుల సన్నిధిలో ప్రారంభించినదానికి ముందుగా వారి విషయంలో ఈక్రింది తనియన్ శ్లోకాలను అనుగ్రహించారు - ఆ శ్లోకాలు ఏవి అంటే-

నమః పరమిదం భూయో త్తస్మై వేంకటసూరయే ।
యద్వాగమృతసేకేన సంజీవిత మిదం జగత్ ॥
భగవంత మివానంతకల్యాణగుణసాగరమ్ ।
వేదాంతదేశికం నౌమి వేంకటేశగురూత్తమమ్ ॥

(ఎవరి సూక్తులనే అమృతంయొక్క సేచనంచేత ఈ జగత్తు అంతా ఉజ్జీవించిందో, ఆ వేంకటనాథులకు ఈ గొప్ప నమస్కారం అగుగాక. భగవానుని వలె అసంఖ్యేయకల్యాణగుణసాగరులైనవారు, వేదాంతదేశికులు అనే పేరుగలవారు, గొప్ప ఆచార్యులైన వేంకటనాథులకు నమస్కరిస్తున్నాను)

శ్రీ పేరరుళాళయ్యన్ కాంచీపురంలో ఉన్న సమయంలో, కాశ్మీరదేశంనుండి వచ్చిన ఒక పండితుడు వారిని వేదాంతవాదానికి ఆహ్వానించాడు. శ్రీతిరుమల శ్రీనివాసాచార్యులవారు ఈ వాదంలో న్యాయనిర్ణేతగా పిలువబడ్డారు. చాలా దినాలు వాదం చేయబడిన తరువాత పేరరుళాళయ్యన్ వాదంలో జయించారు. వారు చేసిన చాలా గొప్ప న్యాయసంచారాలను చూచి శ్రీనివాసాచార్యులవారు వాటిని "అపర బ్రహ్మసృష్టి"గా కీర్తించారు. పేరరుళాళయ్యన్‌కు శారీరకమీమాంసాశాస్త్రంలోగల పరినిష్ఠితమైన పాండిత్యం ఎంత ఆశ్చర్యకరమైనది! అంటే, స్వయంగా శ్రీదేశికులు వారిని **"పర్యాయభాష్యకారు"**లని ప్రశంసించారు.

కొన్ని ఏండ్ల తరువాత శ్రీపేరరుళాళయ్యన్ శ్రీదేశికులను ప్రార్థించి, తమకు సన్న్యాసాశ్రమస్వీకారాన్ని చేయడానికి అనుమతిని ఇవ్వవలసినదని కోరారు. దేశికులు వారి ప్రార్థనను సంతోషంతో అంగీకరించగా, పేరరుళాళయ్యన్ తురీయాశ్రమ స్వీకారాన్ని చేశారు. పేరరుళాళ జీయర్ అనే పేరుతో ప్రసిద్ధులయ్యారు. ఈ సమయంలోనే దేశికుల శిష్యులు మఱి ఇద్దరు సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించారు. వారు శ్రీ ప్రభాకరజీయర్, వెణ్ణెయ్ కుత్ర జీయర్ - అనేవారు. తరువాత తమ ఆచార్యులైన దేశికులతో పాటు పేరరుళాళ జీయర్ సంచారాన్ని చేశారు.

మహమ్మదీయుల దండయాత్రలు జరిగిన కాలంలో క్రీ.శ.1327వ సం॥లో శ్రీబ్రహ్మతంత్ర పరకాలస్వామి తమ ఆచార్యులైన దేశికులతోపాటు సత్యమంగళ క్షేత్రాన్ని చేరారు అక్కడ కొన్నిఏండ్లు ఉన్న తరువాత వారిద్దరు తిరునారాయణ పురాన్ని చేరి అక్కడ కొన్నాళ్ళు ఉన్నారు. ఆ సమయంలోనే బ్రహ్మతంత్రపరకాల స్వామి కుమారవరదాచార్యస్వామి వారితో కలసి దేశికుల సన్నిధిలో చాలా ఏళ్ళు శాస్త్రకాలక్షేపాన్ని చేశారు. అపుడే శ్రీదేశికులు తిరువాయ్‌మొళికి తాము రచించిన నిగమపరిమళమనేవ్యాఖ్యతోపాటు ఆఱాయిరప్పడివ్యాఖ్యను కాలక్షేపంగా వీరికి అనుగ్రహించారు. పేరరుళాజీయర్‌మాత్రం శ్రీదేశికుల సన్నిధిలో ఆఱాయిరప్పడి వ్యాఖ్యను కాలక్షేపం చేయలేదు. అపుడు దేశికులు "ఎందువల్ల మీరు ఆఱాయిరప్పడి కాలక్షేపంలో అన్వయించలేదు?'' అని పేరరుళాళ జీయర్‌ను అడిగారు. అపుడు



పేరరుళాళ జీయర్ సమాధానం పల్కుతూ, శ్రీకుమార వరదచార్యులవారు ఆత్రేయ రామానుజులవారి విశేషానుగ్రహానికి పాత్రమైనందువల్ల, వారితో కలసి తాము సబ్రహ్మచారులై, కాలక్షేపంలో అన్వయించడం వారిపట్ల అపచారం కాగలదని భావించినట్లు, తాము ఆఱాయిరప్పడివ్యాఖ్యను శ్రీకుమారవరదాచార్యస్వామివారి సన్నిధిలో అధ్యయనం చేయదలచావని, అందుకు తమకు అనుజ్ఞను ఇవ్వాలని దేశికులను ప్రార్థించారు. ఈ సమయంలోనే - అంటే, **13-8-1338**వ తేదీన - పేరరుళాళ జీయర్ శ్రీదేశికులకు ఉద్దేశించి ఈ క్రింది సుప్రసిద్ధ తనియన్ శ్లోకాన్ని విన్నవించారు.

**రామానుజదయాపాత్రం జ్ఞానవైరాగ్యభూషణమ్ ।**
**శ్రీమద్వేంకటనాథార్యం వందే వేదాంతదేశికమ్ ॥**

శ్రీ దేశికులు ఈ తనియన్ శ్లోకాన్ని అంగీకరించి, దానిని సదా దివ్య ప్రబంధాల అనుసంధానికి ముందు అనుసంధించాలని నియమించారు. ఆ దినంలోనే పేరరుళాళ జీయర్‌స్వామివారు తాము శ్రీకుమారవరదాచార్య స్వామివారి సన్నిధిలో భగవద్విషయ (ఆఱాయిరప్పడి వ్యాఖ్య) కాలక్షేపం ప్రారంభం చేయడానికి ముందు ఈ క్రింది తనియన్‌శ్లోకాన్ని కుమారవరదాచార్యస్వామివారి విషయంగా విన్నపించారు.

**శ్రీమల్లక్ష్మణయోగీంద్ర సిద్ధాంతవిజయధ్వజమ్ ।**
**విశ్వామిత్రకులోద్భూతం వరదార్య మహం భజే ॥**

శ్రీ దేశికులు సర్వశాస్త్రాలను తమకు మేనమామ అయిన ఆత్రేయ రామానుజాచార్యస్వామివారి సన్నిధిలో అధ్యయనం చేశారు. అంతేకాక, తిరునారాయణపురంలో అర్చారూపంలో వేంచేసి ఉండే భగవద్రామానుజుల విశేష కటాక్షానికి దేశికులు పాత్రమయ్యారు. భగవద్రామానుజులు, ఆత్రేయ రామానుజా చార్యులవారు - అనే ఈ ఇద్దఱి జన్మనక్షత్రాలు, మాసం ఒక్కటే. అది చిత్తిరమాసంలో ఆర్ద్రా నక్షత్రం. బహుశః ఈ కారణంవల్లనే వీరిద్దరి అనుగ్రహాన్ని దేశికులు పొందారనే విషయాన్ని సూచించడంకోసమే దేశికుల తనియన్‌శ్లోకంలో - **"రామానుజదయా పాత్రమ్"** అనే విశేషణాన్ని పేరరుళాళ జీయర్ ప్రయోగించారు. ఈ తనియన్ శ్లోకంలో నిక్షిప్తమై ఉండే పలు దివ్యార్థాలను పూర్వాచార్యులు పలువురు తమ వ్యాఖ్యలలో వివరించారు. శ్రీ దేశికుల సన్నిధిలో శాస్త్రాధ్యయనాన్ని చేసిన పేరరుళాళ

జీయర్ అందులో గాఢమైన పాండిత్యాన్ని సంపాదించారు. శాస్త్రీయమైన వారి శైలిని చూచి ఆశ్చర్యపడి ఆనందించిన శ్రీదేశికులు వారికి **"పరకాల"** అనే బిరుదును ప్రసాదించారు. (ఇతరుల వాదాలను నిసించడంలో యమునివంటివారని దీని తాత్పర్యం). వీరు, క్రీ.శ.1338వ సం॥లో అద్వైతులతో ఎన్నో దినాల తరబడి జరిగిన గొప్ప వాదయుద్ధంలో వారిని జయించారు. శ్రీదేశికుల, శ్రీకుమారవరదా చార్యులవారి సమ్మతి లేనిదే ఏ మాటను మాటలాడని ఆచార్యవిధేయతను కలవారు- శ్రీ పేరరుళాళ జీయర్. కాని, ఆదినంలో వారిరువురు లేనందువల్ల తామే స్వతంత్రించి వాదించవలసి వచ్చింది. ఈ సందర్భాన్ని శ్రీపేరరుళాళ జీయర్ **"ఆచార్యావతార ఘట్టార్థః"** అనే కృతిలోని ఈ క్రింది మొదటి శ్లోకంలో ప్రస్తావించారు.

**ఆ శ్లోకం ఏమంటే -**

**బ్రహ్మతంత్రస్వతంత్రేణ పరకాలయతీందునా ।**
**ఆచార్యవతారఘట్టార్థః సంగ్రహేణ ప్రకాశ్యతే ॥**

ఒకానొక సమయంలో కాశీనగరంనుండి కొంతమంది విద్వాంసులు శ్రీరంగానికి వేదాంతశాస్త్రవాదాన్ని చేయడంకోసం వచ్చారు. శ్రీవేదాంతదేశికుల ఆజ్ఞానుసారం పేరరుళాళజీయర్ ఆ వాదంలో పాల్గొని, ప్రత్యర్థివాదులు అందఱిని శ్రీదేశికుల అనుగ్రహంతో, తమవాద పటిమతో ఓడించారు. దేశికులు తమ ప్రియశిష్యుల విజయాన్ని చూచి వారికి **"బ్రహ్మతంత్ర అధ్యాపక"** అని ప్రశంసించారు. అంతేకాక వారు సిద్ధాంత స్థాపననుచేసిన సంగతికి గుర్తుగా వరదరాజస్వామి అనుగ్రహరూపంగా **"బ్రహ్మతంత్ర స్వతంత్ర"** అనే బిరుదును ఇచ్చారు. **"బ్రహ్మతంత్ర స్వతంత్ర"** అంటే - వేదాంత శాస్త్రంలో స్వతంత్రమైన - అసమానమైన పాండిత్యాన్ని కలవారని భావం. ఈ బిరుదు పేరరుళాళజీయర్‌కు సమస్త ఆలయ మర్యాదలతో పాటుగా అనుగ్రహింపబడింది.

శ్రీదేశికుల ఆదేశానుసారం శ్రీబ్రహ్మతంత్రస్వతంత్ర జీయర్‌స్వామివారు కాంచీపురంలోని వరదరాజస్వామి ఆలయశ్రీకార్యనిర్వాహకులుగా నియమింప బడ్డారు. కాంచీపురంలో శ్రీదేశికుల నియమనాన్ని అనుసరించి శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర జీయర్‌స్వామి ఒక మఠాన్ని ఏర్పాటు చేశారు. పూర్వాచార్యులు అనుగ్రహించిన ఉపదేశాలను ప్రచారంచేయడం, భగవద్రామానుజుల సిద్ధాంతాన్ని వ్యాప్తి చేయడమే ఈ మఠస్థాపనలోని ముఖ్యోద్దేశ్యం. ఈ మఠమే ఈనాటి బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలమఠం. కాంచీపురంలోని వరదరాజస్వామి ఆలయం రెండవ ప్రాకారంలో కన్పించే ఈ మఠానికి చెందిన శిలాశాసనాలు చాలా ముఖ్యమైనవి. ఇవి పరకాలమఠస్థాపననుగూర్చి తెలిపే ముఖ్యసాక్ష్యాలు. ఆ శాసనాలలో లభించే వివరాలనుబట్టి - శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలమఠం కాంచీపురంలో శ్రీదేశికుల ఆజ్ఞానుసారంగా శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర జీయర్ స్వామిచే శకాబ్ది 1359వ సం॥లో (క్రీ.శ.1286లో) స్థాపింపబడినదని, ఈ మఠకార్యనిర్వాహకులుగా శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్రజీయర్ దేశికుల ఆజ్ఞానుసారం నియమింపబడ్డారని తెలుస్తున్నది.



మహమ్మదీయుల దండయాత్రల ప్రభావం సమసిన తరువాత శ్రీదేశికులు శ్రీరంగానికి శిష్యసమేతంగా తిరిగి వచ్చారు. ఆ సమయంలో శ్రీరంగనాథునకు పెద్ద ఎత్తున సంప్రోక్షణం జరిగింది. కాని, ఆ సమయంలో ఇంకొక కొత్త సమస్య ఏర్పడింది. ఆళ్వార్లనుగూర్చి, వారి దివ్యప్రబంధాలనుగూర్చిన దివ్యత్వం, ప్రామాణ్యం నిరూపింప బడినతరువాతనే మార్గళినెలలో అధ్యయనోత్సవనిర్వహణను చేయాలని అక్కడ కొంతమంది పట్టుబట్టారు. అపుడు శ్రీదేశికులు ద్రవిడోపనిషత్ తాత్పర్య రత్నావళి, ద్రవిడోపనిషత్‌సంగతివంటి కృతుల రచనలద్వారా, పలు వాదగోష్ఠులను నిర్వహించి, వారిని జయించడం ద్వారా ఆళ్వార్ల దివ్యత్వాన్ని నిరూపించి, ఆళ్వార్ల అర్చామూర్తు లను పునః స్థాపింపజేసి, మార్గళిమాసంలో అధ్యయనోత్సవాన్ని ఎంతో వైభవంగా జరిపించారు.

శ్రీ దేశికులు శ్రీమద్రహస్యత్రయసారమనే ఉద్గ్రంథాన్ని రచించి, దానిని తన ప్రధానశిష్యులైన బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామికి, ఇతర శిష్యులకు బోధించారు. దేశికులు ఆయా సందర్భాలలో సిద్ధాంతవాదాలను చేసేటపుడు వాదించిన వాదాలను శ్రీబ్రహ్మతంత్రస్వామివారు గ్రంథస్థం చేశారు. ఆ గ్రంథమే శతదూషణి. ఈ మహాగ్రంథాన్ని దేశికుల సన్నిధిలో అధ్యయనం చేసిన బ్రహ్మతంత్రస్వామి వైదుష్యం మఱింతగా శోభించి, భగవద్రామానుజసంప్రదాయ ప్రవర్తకులతో పరమాచార్యులుగా ప్రకాశించారు. దేశికులు తమ కుమారులైన కుమార వరదాచార్యస్వామిని, బ్రహ్మతంత్ర పరకాలస్వామిని సంప్రదాయప్రచార పరిరక్షణ నిర్వహణల తమకు వారసులుగా నియమించి, శ్రీరామానుజసంప్రదాయప్రచారాన్ని, పరిరక్షణను చేయమని వారిని ఆదేశించారు. తాము ఆరాధించే లక్ష్మీహయగ్రీవస్వామి అర్చామూర్తిని బ్రహ్మతంత్రస్వతంత్రజీయర్ స్వామికి అనుగ్రహించి, దానిని పరకాల

మఠంలో ప్రధాన అర్చామూర్తిగా ప్రతిష్ఠింపజేశారు. అంతేకాక, దేశికులు సుదర్శన పాంచజన్యముద్రలను వారికి ఇచ్చి, వానిని పంచసంస్కారసమయంలో ఉపయోగించ మని తెలిపారు. అంతిమసమయంలో శ్రీదేశికులు తమ శ్రీచరణాలను బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి ఒడిలో, శిరస్సును తమ పుత్రులు కుమార వరదాచార్య స్వామి ఒడిలో పెట్టుకొని ఆచార్యశ్రీచరణసన్నిధిని చేరారు ఆ తరువాత కొంతకాలం పాటు పరకాలమఠం ప్రధానకేంద్రం కాంచీపురంలో కొనసాగింది.

శ్రీఘటికాశతం అమ్మాళ్ అనే ఆచార్యులు నడాదూర్ అమ్మాళ్‌కు మనుమలు. వీరు బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి సన్నిధిలోనే వేదాంతశాస్త్రాధ్యనాన్ని చేశారు. ఘటికాశతం అమ్మాళ్ వారి విషయంలో ఒక తనియన్ శోకాన్ని రచిస్తూ, ఆ శ్లోకంలో శ్రీదేశికులు అనుగ్రహించిన **"పర్యాయభాష్యకార", "బ్రహ్మతంత్రస్వతంత్ర"** అనే బిరుదును, శ్రీనివాసాచార్యులవారు పల్కిన **"అపరబ్రహ్మ"** అనే బిరుదును ప్రయోగించారు. ఈ తనియన్ శ్లోకం ఏమి? అంటే -

**పర్యాయభాష్యకారాయ ప్రణతార్తిం విధూన్వతే ।**
**బ్రహ్మతంత్రస్వతంత్రాయ ద్వితీయబ్రహ్మణే నమః ॥**

శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామికి శిష్యులు పలువురు ఉన్నారు. కిడాంబినాయనార్, ఘటికాశతం అమ్మాళ్, కొమాండూర్ ఆచ్చాన్, పిళ్ళై అప్పై, పేరరుళాళయ్యార్ అప్పై, కందాడై ఆణ్డాన్, వీరవల్లి పిళ్ళై మొదలైనవారు వారిలో కొందరు.

కుమార వరదాచార్యస్వామివారితో కలసి శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామి శ్రీదేశికుల కృతులను పరిరక్షించి, ప్రచారం చేశారు. తంజావూరులోని వెన్నాట్రజ్కరైలో అనధ్యయన సమయంలో నాలాయిర దివ్యప్రబంధతనియన్ పాశురాలను, దేశికుల తనియన్‌లను, దేశికప్రబంధాన్ని అనుసంధించే క్రమాన్ని ఏర్పాటు చేశారు. బ్రహ్మతంత్రస్వామి వీటితోపాటు కుమారవరదాచార్యులవారి పిళ్ళై అన్దాదిని, వాళిత్తిరునామాన్నికూడా అనుసంధించే ఏర్పాటు చేశారు. ఈ క్రమం అక్కడ ఈనాటికీ పాటింపబడుతున్నది. వరదాచార్యులవారు, బ్రహ్మతంత్రస్వతంత్ర స్వామి వారు కలసి విస్తృతంగా పలుచోట్ల పర్యటించి శ్రీరామానుజసిద్ధాంతప్రచారాన్ని చేశారు.

క్రీ.శ.1379వ సం॥లో తిరుమలలలో పరకాలమఠానికి నూతన భవనాన్ని నిర్మింపజేసి, మఠప్రధానకేంద్రాన్ని తిరుమలకు మార్చారు. మఠంలో దేశికుల



అనుగ్రహించిన శ్రీలక్ష్మీహయగ్రీవుల మూర్తిని ప్రధాన అర్చామూర్తిగా ప్రతిష్ఠించారు. తిరుమలలోని పరకాలమఠం అచిరకాలంలోనే శ్రీరామానుజసంప్రదాయ ప్రచారానికి ప్రధానకేంద్రమైనది. తిరుపతిలోని గోవిందరాజస్వామి ఆలయంలో దేశికుల సన్నిధిని నిర్మించి, అర్చామూర్తిని ప్రతిష్ఠించారు. ఆ ప్రాంతాన్ని పాలించే దండనాయకుడైన యాదవరాయలు మైసూరుకు తిరిగి వస్తూ, తిరుపతి యాత్రగా వచ్చి, బ్రహ్మతంత్ర స్వామి సన్నిధిలో పంచసంస్కారాలను పొందాడు. వారి సన్నిధిలో ప్రపత్తిని చేశాడు. తన ఆచార్యులైన బ్రహ్మతంత్రస్వామిని తిరిగి మైసూరుకు వచ్చి రాజగురువుగా వేంచేసి ఉండవలసినదని అతడు కోరాడు. అతని కోరికను కాదనలేక బ్రహ్మతంత్ర స్వామి మైసూరుకు తిరిగి వేంచేశారు. క్రీ.శ.1399వ సం॥లో యాదవరాజు మైసూరు ప్రభువు అయ్యాడు. అప్పటినుండి అతడు శ్రీవైష్ణవసంప్రదాయప్రచారానికి విశేషంగా సహాయం చేశాడు. బ్రహ్మతంత్ర స్వామి, యాదవరాజుల మధ్య ఏర్పడిన గురుశిష్య సంబంధం శ్రీవైష్ణవసంప్రదాయప్రచారానికి చాలా దోహదపడింది. యాదవరాయలు సమర్పించిన దీపాలు ఈ నాటికీ తిరుమల గర్భాలయంలో వెల్గడం దానికి ఒక సాక్ష్యం.

కాంచీపురంలోని శిలాశాసనాలనుబట్టి, సర్వజ్ఞసింగయ్య భూపాలుడనే ఆంధ్రప్రభువు కుమారవరదాచార్యస్వామిని, బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామిని గౌరవించి, సిద్ధాంతప్రచారంలో వారికి అన్నివిధాలైన సహాయసహకారాలను అందించాడు అని తెలుస్తున్నది. కుమారకంపన్న ఆహ్వానంమేరకు బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి కర్ణాటకదేశంలో పర్యటించి, అక్కడ శ్రీరామానుజ సిద్ధాంతాన్ని వ్యాపింపజేశారు. తిరునారాయణపురంలో ఇప్పటికీ అసంపూర్ణంగా కన్పించే పెద్దరాజ గోపురం వీరిచే నిర్మింపబడినదే.

అంతకుముందు, చాలాకాలంక్రితం బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామిని ఒక గొప్ప అద్వైతపండితుడు వాదానికి రావలసినదిగా సవాలు చేశాడు. అతని పేరు పేరరుళాళయ్యార్ అప్పై. అతనికి చాలామంది శిష్యులున్నారు. తన శిష్యులతో కంచికి వచ్చి, అక్కడ బ్రహ్మతంత్రస్వామిని వాదానికి ఆహ్వానించాడు. బ్రహ్మతంత్రస్వామి అతనిని వాదంలో ఓడించి, శ్రీవైష్ణవునిగా చేశారు. అతనికి గ్రంథచతుష్టయాన్ని బోధించి, శ్రీసంప్రదాయాన్ని ప్రచారం చేయవలసినదిగా నియమించారు. బ్రహ్మతంత్రస్వామి తమ వార్ధక్యదశలో తమకు తరువాత పరకాల మఠాన్ని నిర్వహించగల్గిన సమర్థుడైన వ్యక్తికోసం అన్వేషించేటపుడు, ఆ భగవానుని సంకల్ప

వశంచేత పేరరుళాళయ్యర్ అప్పై మార్గళిమాసంలో ఒకనాడు బ్రహ్మతంత్ర స్వామి వద్దకువచ్చి, తమకు తురీయాశ్రమాన్ని అనుగ్రహించవలసినదిగా ప్రార్థించారు. వెంటనే బ్రహ్మతంత్ర స్వామి ఇది అంతా శ్రీదేశికులు అనుగ్రహమేనని భావించి సంతోషించి, అప్పైకు సన్న్యాసాశ్రమాన్ని ఇచ్చారు. అంతేకాక, తమకు పిమ్మట పరకాలమఠానికి ఉత్తరాధికారిగా అప్పైను నియమించారు. అప్పటినుండి అప్పై ద్వితీయ బ్రహ్మతంత్ర పరకాలస్వామి అయ్యారు. క్రీ.శ.1386 సం॥లో ఒక పుణ్య తిథినాడు, ప్రథమ బ్రహ్మతంత్రస్వామి శ్రీదేశికుల శ్రీపాదతీర్థాన్ని సేవించి, దేశికుల శ్రీచరణాలను స్మరిస్తూ పరమపదాన్ని జేరారు. అప్పటికి వారి వయస్సు నూటేండ్లు. కుమారవరదాచార్యస్వామివారి సూచనను అనుసరించి వీరవల్లి పిళ్ళై బ్రహ్మతంత్ర స్వామికి చరమకైంకర్యాలను చేశారు.

శ్రీప్రథమ బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామివారు పలు గ్రంథాలను రచించారు. ఆచార్యావతార ఘట్టార్థం, ఆచార్యమంగళం, విజయేంద్ర పరాజయం, దివ్యసూరి స్తుతి మొదలైనవి వానిలో కొన్ని. దేశికులపట్ల వారికి గల అనన్యభక్తి వారిని **“శ్రీమత్ శ్రీకవికథకకంఠీరవచరణనళిన యుగళ విన్యస్త సమస్తాత్మ భర”** అని స్తుతించేటట్లు చేసింది.

శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి స్థాపించిన పరకాలమఠం ఈ నాటికీ (అవిచ్ఛిన్నసదాచార్య పరంపరతో దేదీప్యమానంగా వెల్గుతున్నది.). “వీరి ఆచార్య భక్తి ఉదాహార్యం. అందఱికి అనుష్ఠేయం. తూప్పుల్ గ్రామానికి వెళ్ళినపుడు ఆ దేశికులు తమ గృహంలో లేనప్పటికి వీరు ఆ ఇంటికి పలు ప్రదక్షణాలు చేసేవారట. ఏనాడూ తమ ప్రత్యేకతను చాటుకోకుండా, శ్రీదేశికుల శ్రీచరణసంబంధమే తమకు నిరూపకంగా భావించేవారు. తురీయాశ్రమం గృహస్థాశ్రమంకంటే ఉన్నతమైనది అయినా, శిష్యాచార్యసంబంధం విషయంలో ఈ ఔన్నత్యం పాటింపబడదు. దీనికి ఉదాహరణంగా మణక్కాల్ నమ్బి - శ్రీయామునులు, పెరియనమ్బి - శ్రీరామానుజులు, శ్రీదేశికులు - బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామి కుమార వరదాచార్య - బ్రహ్మతంత్రస్వామి మధ్యగల శిష్యాచార్య సంబంధాన్ని గ్రహించవచ్చు.

తూప్పుల్ అగ్రహారంలో బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి సన్నిధి ఉన్నది. వీరి అర్చామూర్తి పరకాలమఠంలో నిత్యారాధనను అందుకొంటున్నది.



# (2) శ్రీవాత్సవేదాంత రామానుజ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలమహాదేశికులు

( ద్వితీయబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల మహాదేశికులు )



(ఆస్థాననిర్వాహం - 1386-1394)

ద్వితీయ బ్రహ్మతంత్రస్వతంత్రపరకాల మహాదేశికులు పూర్వాశ్రమంలో గొప్ప అద్వైతులు. ఒకానొక సమయంలో వీరు వందలాది శిష్యులతో కలసి విజయ యాత్రగా వేంచేస్తూ కాంచీపురానికి వచ్చి, ప్రథమ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల స్వామివారితో వేదాంతవాదంలో పాల్గొన్నారు. ఇద్దఱిమధ్య వాదోపవాదాలు తీవ్రంగా వారం దినాలపాటు జరిగాయి. వారం గడచినప్పటికీ ద్వితీయ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామికి విశిష్టాద్వైతసిద్ధాంతంలోని ప్రాముఖ్యం స్పష్టంగా గోచరించింది. వాదం పరిసమాప్తి అయేనాటికి ముందునాటి రాత్రిలో వారికి ఒక అద్భుతమైన స్వప్నం వచ్చింది. ఆ కలలో శ్రీనివాసుడు విశిష్టాద్వైతసిద్ధాంతవైలక్షణ్యాన్ని వారికి బోధించాడు. తెల్లవారగానే, ఉదయకాలకృత్యాలను పూర్తిచేసికొని, తమవద్ద ఉండే పూర్వులు రచించిన అద్వైత గ్రంథాలను పరిశీలించగా, శ్రీనివాసుడు కలలో చెప్పినది అంతా వాస్తవమని, విశిష్టాద్వైతం పరమప్రామాణిక మని తాము గ్రహించిన విషయం సత్యమని, ఆ మతం వేదాలకు మిక్కిలి అనుగుణమని గ్రహించారు. వెంటనే తాము అంతవరకు నమ్మిన సిద్ధాంతాన్ని వీడి, శ్రీనివాసుడు కలలో బోధించిన

శ్రీరామానుజులసిద్ధాంతాన్ని అనుసరించాలని నిర్ణయించుకొన్నారు. శ్రీ ప్రథమ బ్రహ్మతంత్ర స్వతంత్రపరకాలస్వామివద్దకు వచ్చి, వారి పాదాలపై పడి, తమకు శ్రీరామానుజసంప్రదాయానుగుణమైన శ్రీవైష్ణవదీక్షను ప్రసాదించమని అభ్యర్థించి, పొందారు. ప్రథమ బ్రహ్మతంత్రపరకాలస్వామివారు ఆ ప్రార్థనను మన్నించారు.

ద్వితీయ బ్రహ్మతంత్రస్వామి గ్రంథచతుష్టయాన్ని మొదటి బ్రహ్మతంత్ర స్వామిసన్నిధిలో అధ్యయనం చేశారు. వారి సిద్ధాంతప్రచారాలలో బహుథా తోడ్పడ్డారు. కొంతకాలమైనా తరువాత ప్రథమబ్రహ్మతంత్రస్వామిని తమకు తురీయాశ్రమదీక్షను ప్రసాదించవలసినదిగా అర్థించారు. అప్పటికే ప్రథమ బ్రహ్మతంత్రస్వామి చాలా వృద్ధులు. తమకు తరువాత పరకాలమఠనిర్వాహాన్ని చేసే సమర్థులైన వ్యక్తి కోసం అన్వేషించే ప్రథమ బ్రహ్మతంత్రస్వామి ఆనందంతో ద్వితీయబ్రహ్మతంత్రస్వామికి సన్న్యాసాశ్రమదీక్షను ప్రసాదించారు. సాక్షాత్తు శ్రీవేంకటేశ్వరుడే తమ ప్రార్థనను ఆలకించి, వారిని తమవద్దకు పంపినట్లుగా భావించి, వారిని పరకాలమఠ నిర్వాహకులుగా క్రీ.శ.1386 సం.లో నియమించారు. అప్పటి నుండి వారు శ్రీద్వితీయబ్రహ్మతంత్ర స్వతంత్ర శ్రీవాత్స్యవేదాంత రామానుజ మహాదేశికులుగా ప్రసిద్ధులయ్యారు.

ద్వితీయ బ్రహ్మతంత్రస్వామి వేదాంతశాస్త్రంలో గొప్పదిట్ట. తమ ఆచార్యులైన ప్రథమ బ్రహ్మతంత్రస్వామి చూపిన మార్గాన్ని అనుసరిస్తూ, పలువురి పండితులను తమ శిష్యులుగా చేసికొన్నారు. అద్వైతసంప్రదాయంలో తాము ఉన్న సమయంలో తమకు శిష్యులైనవారికి అందటికి శ్రీవైష్ణవదీక్షను ప్రసాదించి, వారిని శ్రీరామానుజ సంప్రదాయంలోకి వచ్చేటట్లు చేశారు. పరకాలమఠ గ్రంథాలయాన్ని అపూర్వమైన, విలువైన గ్రంథాలను సేకరించడంద్వారా అభివృద్ధి చేశారు. వీరు పంచకాల పరాయణులు. తమ శిష్యులకు శ్రీభాష్యం, గీతాభాష్యం, రహస్యత్రయసారం, భగవద్విషయ, ఉపనిషత్తులు మొదలైన పలు సంప్రదాయ గ్రంథాలను ప్రవచించారు. ఎన్నో వాదాలలో పాల్గొని శ్రీరామానుజసిద్ధాంతాన్ని సుస్థాపించారు. చాలా దివ్య దేశాలను దర్శించి, అచటి అర్చామూర్తులకు మంగళాశాసనం చేశారు. విజయనగర ప్రభువులు వీరికి శిష్యులై, అన్ని విధాలుగా వీరికి సహకరించారు. వీరు అనుగ్రహించిన పలుగ్రంథాలలో నాలాయిరదివ్యప్రబంధంపై పన్నీరాయిరప్పడి వ్యాఖ్య, పన్నీరా యిరప్పడి గురుపరంపరాప్రభావం మొదలైనవి కొన్ని. దురదృష్టవశంచేత పన్నిరా యిరప్పడి గురుపరంపరాప్రభావం స్వల్పమైనభాగంతప్ప చాలా వరకు నష్టమైనది.



వీరు పరకాలమఠాన్ని 8 సంవత్సరాల పాటు క్రీ.శ. 1394 వరకు నిర్వహించారు. వీరి తనియన్ -

బ్రహ్మతంత్రకృపావాప్త జ్ఞానయాథాత్మసంపదమ్ ।
నమామి వాత్స్యవేదాంతరామానుజమునీశ్వరమ్ ॥

## 3) శ్రీశ్రీనివాసబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలమహాదేశికులు

**(తృతీయ బ్రహ్మతంత్ర స్వతంత్రపరకాల మహాదేశికులు)**



**(ఆస్థాననిర్వాహం - 1394-1406)**

శ్రీవాత్స్య వేదాంతరామానుజస్వామివారి తరువాత శ్రీశ్రీనివాస బ్రహ్మతంత్ర పరకాలస్వామి పరకాల మఠాన్ని అధిష్ఠించారు. వీరు తృతీయ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలమహాదేశికులుగా ప్రసిద్ధులు. వీరు చాలా గొప్ప పండితులు. ఎన్నో ఉద్గ్రంథాలను రచించారు. మూవాయిరప్పడి గురుపరంపరా ప్రభావం, పూర్వాచార్య వాళిత్తిరునామాలు, దివ్యప్రబంధానుసంధాన దీపికవంటివి వాటిలో కొన్ని. వీరు శ్రీదేశికులను ప్రభాతాన్నికూడా రచించారు.

వీరు పంచకాలపరాయణులు. జ్ఞానవైరాగ్యానుష్ఠానాలకు ప్రసిద్ధులు. క్రీ.శ.1380 లో వీరు ఉత్తమాశ్రమ స్వీకారాన్ని చేశారు. క్రీ.శ.1405 వరకు సుమారు 25 ఏండ్లు ఆస్థానాన్ని అలంకరించారు. వీరు విరచించిన మూవాయిరప్పడి గురుపరం పరావైభవం అనే గ్రంథం పుర్వాచార్యపరంపరాచరిత్రగ్రంథాలలో మిక్కిలి ప్రసిద్ధి చెందింది.

కుమారవరదాచార్యస్వామివారు తమ ప్రత్యక్షశిష్యులైన ఎమ్బెరుమానా రప్పన్‌కు తాము ఆరాధించే దేశికుల అర్చామూర్తిని శ్రీతృతీయ బ్రహ్మతంత్ర స్వామివారికి అనుగ్రహించారు. ఈ అర్చామూర్తి పరకాలమఠంలో లక్ష్మీహయ గ్రీవమూర్తులతో సన్నిధానంలో వేంచేపు చేయబడి ఈనాటికీ నిత్యారాధన స్వీకరిస్తున్నది. వీరి తనియన్ -

శ్రయామో వాత్స్యవేదాంతరామానుజకృపాస్పదమ్ ।
బ్రహ్మతంత్రస్వతంత్రశ్రీ శ్రీనివాసగురూత్తమమ్ ॥

## 4) శ్రీ పరకాల మహాదేశికులు



(ఆస్థాన నిర్వాహం - 1406-1424)

శ్రీతృతీయ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామివారికి పిమ్మట శ్రీపరకాల బ్రహ్మతంత్ర స్వతంత్రపరకాలస్వామి పరకాలమఠాన్ని క్రీ.శ.1406 సం॥లో



అలంకరించారు. ఈ స్వామివారు అత్యంత ప్రసిద్ధులైన పండితులు. వీరు పన్నెండు భాషలలో పాండిత్యాన్ని గడించారు. ఉత్తర భారతదేశంలో పలుచోట్ల వాదయుద్ధాలను చేసి గెలిచారు.

అసంఖ్యాకులైన భక్తులకు శ్రీవైష్ణవదీక్షను అనుగ్రహించారు. శిష్యులపట్ల వీరు తల్లివలె చూపే ప్రేమ వీరిదగ్గరకు పలువురిని చేర్చింది. పంచకాల పరాయణులైన వీరు గొప్ప శ్రీరంగనాథుని భక్తులు. వీరు క్రీ.శ. 1424 వ సం॥ వరకు, అంటే - సుమారు 18 ఏండ్లపాటు పరకాలమఠ నిర్వాహాన్ని చేశారు. వీరి తనియన్ -

బ్రహ్మతంత్రరమావాసగురువీక్షిత ముత్తమమ్ ।
పరకాలగురుం వందే చిరకాలం దయానిధిమ్ ॥

## 5) శ్రీ వేదాంతరామానుజబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1424-1440)

శ్రీవేదాంతరామానుజస్వామివారు శ్రీపరకాల బ్రహ్మతంత్రస్వతంత్ర స్వామివారి అనంతరం క్రీ.శ.1424 సం॥లో పరకాలమఠాన్ని అధిష్ఠించారు. పూర్వ మఠాధిపతులు చూపిన మార్గాన్ని అనుసరిస్తూ, వీరు తమ పాండిత్యంతో, ఆదరణ

లతో పలువురను శ్రీవైష్ణవసంప్రదాయంలోకి తీసికొనివచ్చారు. వీరికి శిష్యులు అసంఖ్యాకంగా ఉన్నారు. పలు దివ్యదేశాలకు సేవించి మంగళాశాసనం చేశారు.

వీరు చిరకాలం తిరుమలపై వేంచేసి ఉన్నారు. శ్రీకోశభాండారాన్ని (కోశాగారాన్ని) మిక్కిలి వృద్ధి చేశారు. పూర్వాచార్యుల కృతులను సంరక్షించారు. క్రీ.శ.1440 సం॥ వరకు, అంటే - సుమారు 16 ఏండ్లపాటు పరకాలమఠాన్ని పాలించారు. వీరి తనియన్ -

శ్రయామహే శ్రీపరకాలమౌనిపదాశ్రయం తత్కృపాయత్తతుర్యమ్ ।
వేదాంతవిద్యానిలయం మహాంతం వేదాంతరామానుజ సంయమీంద్రమ్॥

## (6) శ్రీశ్రీనివాసబ్రహ్మతంత్రస్వతంత్రపరకాలస్వామి-1



(ఆస్థాన నిర్వాహం - 1440-1460)

శ్రీవేదాంతరామానుజ స్వామివారికి పిమ్మట శ్రీశ్రీనివాస బ్రహ్మతంత్ర పరకాలస్వామి వారు క్రీ.శ.1440 వ సం॥లో పరకాలమఠాధిపతులుగా పట్టాభిషిక్తులయ్యారు. వీరు గొప్ప ప్రతిభను, పాండిత్యాన్ని కలవారు. గ్రంథచతుష్టయంలో అపారమైన వైదుష్యాన్ని సంపాదించి ప్రఖ్యాతి గడించారు. తమ పలు కృతులతో



పూర్వాచార్యులసిద్ధాంతాలను ద్రఢీకరించారు. ఆళ్వార్లు మంగళాశాసనం చేసిన పలు దివ్యదేశాలలో జీర్ణోద్ధరణ కైంకర్యాన్ని నిర్వహించారు. పలువురకు శ్రీవైష్ణవ దీక్షను ప్రసాదించారు. సుమారు 20 సం॥ల కాలం పరకాలమఠాన్ని అలంకరించిన వీరు క్రీ.శ.1460లో పరమపదించారు. వీరి తనియన్ -

వేదాంతలక్ష్మణమునీశ్వరపాదపద్మ
యుగ్మాశ్రయం సకలసద్గుణవారిరాశిమ్ ।
తత్ర్పాప్తతుర్యమనఘం కమలానివాస -
శ్రీబ్రహ్మతంత్రగురువర్య మహం ప్రపద్యే ॥

## (7) శ్రీనారాయణ యోగీంద్ర బ్రహ్మతంత్రస్వతంత్రపరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1460-1482)

శ్రీశ్రీనివాస బ్రహ్మతంత్ర పరకాలస్వామి-1 తరువాత శ్రీనారాయణ యోగీంద్ర బ్రహ్మతంత్ర స్వామి క్రీ.శ.1460లో పరకాల మఠానికి అధిపతులయ్యారు. వీరు పూర్వాశ్రమంలో నృసింహోపాసకులు. గొప్ప యోగసిద్ధిని కలవారు. పలు దినాలు

తరబడి యోగసమాధిలో ఉండగలిగినవారు. వీరు గొప్ప రచయిత. జ్ఞాన వైరాగ్య అనుష్ఠానాలకు నిధి. పలు సద్గ్రంథాలను రచించారు. వీరు కీ.శ.1482 నుండి 22 ఏండ్లపాటు మఠాన్ని పాలించారు. వీరి తనియన్

శ్రీనివాసబ్రహ్మతంత్ర కృపాసార పరిప్లుతమ్ ।
శ్రీనారాయణయోగీంద్రం బ్రహ్మతంత్రగురుం భజే ॥

## (8) శ్రీరంగరాజ బ్రహ్మతంత్రస్వతంత్రపరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1482-1498)

శ్రీనారాయణ యోగీంద్ర బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామి తరువాత శ్రీరంగరాజ బ్రహ్మతంత్ర పరకాలస్వామి క్రీ.శ.1482వ సం॥లో పరకాలమఠాభిషిక్తు లయ్యారు. గ్రంథచతుష్టయంలో వీరి పాండిత్యం చాలా గొప్పది. పలు వైదిక విరుద్ధాలైన సిద్ధాంతాలను నిరాకరిస్తూ, శ్రీరామానుజసిద్ధాంతాలను దృఢపరుస్తూ వీరు పలు గ్రంథాలను రచించారు.

తిరుమలక్షేత్రంలో వీరు చేసిన సేవ చాలా గొప్పది. వీరు పలు ఆలయాల పునరుద్ధరణను చేశారు. సమకాలీనులందఱిచేత గౌరవింపబడిన ఈ స్వామిని



పలువురు ఆశ్రయించారు. తమ పాండిత్యంలో పలువురను వాదంలో జయించి, వారిని తమ శిష్యులుగా చేసికొని, వారికి శ్రీవైష్ణవదీక్షను ప్రసాదించారు. క్రీ.శ.1498 సం॥వరకు, అంటే - 16 సం॥ల పాటు వీరు పరకాల మఠాన్ని అలంకరించారు. వీరి తనియన్

నారాయణాఖ్యమునివర్యకృపాకటాక్ష -
వీక్షావశాత్తచరమాశ్రమతత్త్వసారమ్ ।
తద్దివ్యపాదసరసీరుహదత్తభారం
శ్రీరంగరాజయతిరాజ ముపాసిషీయ ॥

## (9) శ్రీబ్రహ్మతంత్రస్వతంత్రపరకాల మహాదేశికులుస్వామి-4



(ఆస్థాన నిర్వాహం - 1498-1517)

శ్రీరంగరాజస్వామివారి తరువాత చతుర్థ శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల స్వామివారు క్రీ.శ.1498లో పరకాలమఠాధిపతులయ్యాయి. లక్ష్మీదేవి ఉపాయత్వాన్ని గూర్చి వీరు పలు గ్రంథాలను రచించారు. సిద్ధిత్రయంపై వీరు శ్లోకరూపంగా రచించిన వివరణాత్మకగ్రంథం రచించినట్లు కొన్ని పరోక్షాలైన ఆధారాలున్నాయి. బదరీకా

(శమం, నైమిశారణ్యం మొదలైన ఉత్తరభారత దివ్య దేశాలలో విజయయాత్రను చేసి, అచటి అర్చామూర్తులకు మంగళాశాసనం చేశారు. క్రీ.శ. 1517 సం॥ వరకు, అంటే - 17 ఏండ్లపాటు వీరు పరకాల మఠాన్ని పాలించారు.

రంగరాజయతివర్యవీక్షితం తత్కృపాత్తనిగమాంచలద్వయమ్ ।
తత్పదార్పితభరం దయానిధిం బ్రహ్మతంత్రయతివర్య మాశ్రయే ॥

## 10) శ్రీ బ్రహ్మతంత్రస్వతంత్ర యతిరాజపరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1517-1535)

శ్రీ బ్రహ్మతంత్ర స్వతంత్ర యతిరాజపరకాలస్వామివారు చతుర్థ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలమహాదేశికులకు తరువాత క్రీ.శ.1517వ సం॥లో పరకాల మఠాధీశులయ్యారు. వీరు భాష్యకారుల అపరావతారంగా గౌరవింపబడ్డారు. పలుమార్లు గ్రంథచతుష్టయాన్ని శిష్యులను ప్రవచించారు. శ్రీరామానుజ సిద్ధాంతాన్ని విశేషించి ప్రచారం చేశారు. క్రీ.శ.1535 వ సం॥వరకు 18 ఏండ్ల కాలం మఠాన్ని పాలించారు. వీరి తనియన్

శ్రీబ్రహ్మతంత్రపాదాబ్జసంశ్రయావాప్తసంపదమ్ ।
యతిరాజం భజామ శ్రీయతిరాజాహ్వయం గురుమ్ ॥



## 11) శ్రీ వరదబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1535-1552)

శ్రీవరద బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి శ్రీబ్రహ్మతంత్ర యతిరాజస్వామివారికి తరువాత క్రీ.శ.1535లో పరకాలమఠపట్టాన్ని అలంకరించారు. వీరు శతగ్రంథకర్తలుగా ప్రసిద్ధి చెందారు. పిళ్ళాన్ వంశీయులు అయిన వీరు అశుకవి. ఆచార్యపీఠాన్ని వీరు 17 సంవత్సరాలపాటు క్రీ.శ.1552 సం॥ వరకు అలంకరించారు. వీరి తనియన్.

యతిరాజయతీశాంఘ్రి సమాశ్రయసమేధితమ్ ।
వరదబ్రహ్మతంత్రార్యం వరదం సంశ్రయామహే ॥

## 12) శ్రీ బ్రహ్మతంత్రస్వతంత్ర పరాంకుశ పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1552-1567)

శ్రీవరద బ్రహ్మతంత్రస్వతంత్రస్వామికి తరువాత శ్రీబ్రహ్మతంత్ర పరాంకుశ స్వామివారు క్రీ.శ.1552లో పరకాలమఠాధీశ్వరులయ్యారు. వీరు గొప్ప వాదపటిమను కల్గి, పలువాద యుద్ధాలను చేసి జయించారు. వీరు పలు కృతులను దివ్యప్రబంధాలనుగూర్చి వెలయించారు. ఆచార్యపీఠాన్ని 15 ఏండ్లపాటు క్రీ.శ.1567 వరకు నిర్వహించారు. వీరి తనియన్ -

భజామహే వరదయతీంద్రసత్కృపా
సమేధితం సకలమహాగుణాంబుధిమ్ ।
వదావదద్విరదచమూపరాంకుశం
పరాంకుశం యతితిలకం నిరంకుశమ్ ॥



## 13) శ్రీ కవితార్కికసింహ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1567-1583)

శ్రీకవితార్కిక బ్రహ్మ తంత్రస్వతంత్ర పరకాలస్వామివారు శ్రీపరాంకుశ బ్రహ్మతంత్రస్వామికి పిమ్మట క్రీ.శ.1567 సం॥లో పరకాలమఠానికి అధిపతులై 16 ఏండ్లు పాలించారు. వీరు గొప్ప కవి. పంచభాషా ప్రవీణులు. పలు భాషలలో చాలా గ్రంథాలను వెలయించారు. వేంకటనాథీయమనే పేరుతో శ్రీదేశికులచరిత్రను మహాకావ్యంగా మలిచారు. కాని, ఇది కాలగర్భంలో కలసిపోవడం చాలా దురదృష్టకరం. శ్రీదేశికుల రహస్యత్రయసారంపై వీరు ఒక వ్యాఖ్యను రచించారు. ఇదికూడా అదృశ్యమైపోయింది.

వీరు తిరుమలైలోని శ్రీవేంకటేశ్వరునకు చిరకాలం కైంకర్యం చేశారు. సామాన్యులే కాక, ప్రభువులు పలువురు వీరికి శిష్యులయ్యారు. వీరు క్రీ.శ.1583 సం. వకు పరకాలమఠ నిర్వాహాన్ని చేశారు. వీరి తనియన్.

పరాంకుశయతీశాంఘ్రికృపాత్తచరమాశ్రమే ।
కవితార్కికసింహాఖ్యో యతీంద్రే మే నమశ్శతమ్ ॥

## 14) శ్రీ వేదాంత యతిశేఖర బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1583-1607)

క్రీ.శ. 1583 వ సం॥లో శ్రీవేదాంత యతిశేఖరబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల మఠాధీశులయ్యారు. వీరు కవితార్కిక బ్రహ్మతంత్రస్వామికి తరువాత పరకాల మఠాన్ని 24 సం॥ల పాటు పాలించారు. వీరు కందాడై అణ్ణన్ వంశీయులు. గొప్ప పాండిత్యాన్ని, భక్తిని కల వీరు తమ పూర్వాశ్రమంలో దేశికసంప్రదాయానికి ఎనలేని సేవ చేశారు. పలు గ్రంథాలపై వ్యాఖ్యలను రచించిన ఈ స్వామివారు తమ ఆచార్యుల వైభవాన్ని చంపూగ్రంథంగా రచించినట్లు తెలుస్తున్నది. వీరు క్రీ.శ.1607 సం॥ వరకు పరకాలమఠాన్ని అలంకరించారు. వీరి తనియన్ -

**కవితార్కికసింహాఖ్యయతివర్యకృపావశాత్ ।**
**వివృద్ధసంపదం వందే వేదాంతయతిశేఖరమ్ ॥**





## 15) శ్రీ జ్ఞానాబ్ధి బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1607-1618)

శ్రీజ్ఞానాబ్ధిబ్రహ్మతంత్ర స్వతంత్రపరకాలస్వామివారు శ్రీవేదాంతయతి శేఖర స్వామివారి తరువాత పరకాలమఠాధీశులుగా క్రీ.శ. 1607వ సం॥లో పట్టాభిషిక్తులయ్యారు. వీరి కాలంలో పలు సంప్రదాయ గ్రంథాలు రచింపబడ్డాయి. అప్పటి మైసూరుప్రభువు శ్రీరాజ ఒడైయార్ వీరి వద్దనే పంచసంస్కారాలను పొందాడు. ఈ స్వామివారి శిష్యులైన శ్రీరంగరామానుజస్వామి శ్రీభాష్యంపై మూలభావ ప్రకాశికా, శ్రుతప్రకాశికాభావప్రకాశికా వ్యాఖ్యలను, దశోపనిషత్ భాష్యాన్ని, విషయవాక్యదీపికా, శ్రీరామానుజసిద్ధాంతసారసంగ్రహంవంటి పలు ఉద్రంథాలను రచించారు. ఇంకొక శిష్యులు శ్రీవాత్స్య అహోబిలాచార్యులవారు నాలాయిర దివ్యప్రబంధాలపై విస్తృత వ్యాఖ్యను రచించారు. ఈ స్వామి క్రీ.శ.1618 సం. వరకు 11 సంవత్సరాల కాలం పరకాల మఠనిర్వాహాన్ని చేశారు. వీరి తనియన్ శ్లోకం -

**వేదాంతయతివర్యాప్త వేదాంతయుగళాశయమ్ ।**
**జ్ఞానాబ్ధిబ్రహ్మతంత్ర శ్రీపరకాలగురుం భజే ॥**



# 16) శ్రీ వీరరాఘవ యోగీంద్ర బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1619-1640)

శ్రీజ్ఞానాబ్ధి బ్రహ్మతంత్రస్వామివారి తరువాత శ్రీవీరరాఘవయోగీంద్ర బ్రహ్మతంత్ర స్వతంత్రపరకాలస్వామివారు పరకాలమఠాన్ని క్రీ.శ.1619వ సం.లో అధిష్ఠించారు. వీరు 21 సం॥ల పాటు, అంటే - క్రీ.శ.1640వ సం॥ వరకు మఠాన్ని నిర్వహించారు. వీరు శ్రీయామునుల కృతులకు, శ్రీసుదర్శ భట్టర్ కృతులను వివరించి, ప్రచారం చేశారు. పూర్వాచార్యుల కృతులను అన్నిటినీ వీరు ప్రవచించారు. తిరుమలలో చిరకాలం కైంకర్యం చేసి, ఆ క్షేత్రవైభవాన్ని ఇనుమడింపజేశారు. వీరి తనియన్.

జ్ఞానాంబుధిబ్రహ్మతంత్ర పరకాలమహాగురోః ।
అవాప్తతుర్యం వందేఽహం వీరరాఘవయోగినమ్ ॥





# 17) శ్రీ వరదవేదాంత యోగీంద్ర బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1640-1652)

ప్రథమ శ్రీవరదవేదాంత యోగీంద్రబ్రహ్మతంత్ర పరకాలస్వామివారు శ్రీవీరరాఘవయోగీంద్రస్వామివారికి అనంతరం క్రీ.శ.1640వ సం.లో పరకాల మఠాధీశులయ్యారు. పూర్వమఠాధిపతుల మార్గాన్ని అనుసరిస్తూ వీరు శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని, భగవద్రామానుజ సిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి మిక్కిలిగా కృషిచేశారు.

శ్రీరణధీరకంఠీరవ నరసింహరాజ ఒడైయార్ (క్రీ.శ.1639 -1660) వీరి సన్నిధిలోనే శ్రీవైష్ణవదీక్షను పరిగ్రహించాడు. ఈ ప్రభువు పరకాలమఠానికి ఆర్థికంగా చాలా సహాయం చేశాడు. తిరునారాయణపురం (మేల్కోట) లో ప్రబంధ పారాయణ చేసేటపుడు "రామానుజదయాపాత్రమ్" అనే దేశికుల తనియన్‌ను అనుసంధానం చేయాలనే నియమాన్ని ఇతడు ప్రవేశపెట్టినట్లు శాసనాలు బట్టి తెలుస్తున్నది. క్రీ.శ.1652 వకు 12 ఏండ్లపాటు మఠాన్ని పాలించారు. వీరి తనియన్ -

వీరరాఘవయోగీంద్రవిశేషకరుణేక్షితమ్ ।
నమామి మూర్ధ్నా వరదవేదాంతమునిపుంగవమ్ ॥

## 18) శ్రీ వరాహ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1652-1663)

శ్రీవరాహబ్రహ్మతంత్ర స్వతంత్రపరకాలస్వామివారు శ్రీవరదవేదాంత స్వామివారికి పిమ్మట క్రీ.శ.1652 సం.లో పరకాల మఠాన్ని అధిష్ఠించారు. వీరు 11 ఏండ్లపాటు క్రీ.శ.1663 వ సం.వరకు ఈ మఠాన్ని పాలించారు. వీరు తిరుమలై శ్రీనివాసాచార్యులవారి వంశానికి చెందినవారు. వీరు వరాహజయంతినాడు (రేవతీ నక్షత్రంలో) అవతరించారు. వీరు సహజకవి. పదహారవ ఏటనే మధురమైన కవిత్వాన్ని చెప్పారట. యాదవరాజులు వీరి సన్నిధిలో శ్రీవైష్ణవదీక్షను గ్రహించారు. సాలగ్రామ క్షేత్రాన్ని దర్శించి మంగళాశాసనం చేశారు పలు దివ్యదేశాలను వీరు పునరుద్ధరించారు.

శ్రీమద్వరదవేదాంత సంయమీంద్రపదాశ్రయమ్ ।
శ్రీవరాహబ్రహ్మతంత్రస్వతంత్రగురు మాశ్రయే ॥





## 19) శ్రీ వేదాంతలక్ష్మణ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1663-1673)

శ్రీవరాహబ్రహ్మతంత్రస్వామికి తరువాత శ్రీవేదాంతలక్ష్మణ బ్రహ్మతంత్ర పరకాలస్వామివారు క్రీ.శ.1663వ సం.లో పరకాలమఠానికి అధిపతి అయ్యారు. వీరు 10 సం.లపాటు క్రీ.శ. 1673వ సం॥ వరకు మఠాన్ని పాలించారు. వీరు గొప్ప పండితులు. పూర్వాశ్రమంలోనే పలుమార్లు వాదాలలో పాల్గొని విజయాన్ని పొందారు.

శ్రీ వరాహబ్రహ్మతంత్రస్వామి మెచ్చిన కొద్దిమంది పండితులలో వీరు ఒకరు. ఇంకొక శిష్యులైన శ్రీనివాస దీక్షితులు వీరికి పిమ్మట పరకాల మఠాధిపతులయ్యారు. తిరుమలలో చిరకాలం నివసించి శ్రీవేంకటేశ్వరునకు కైంకర్యాన్ని చేశారు. వీరి తనియన్ -

వరాహబ్రహ్మతంత్రశ్రీకృపాస్పద ముపాస్మహే ।
వేదాంత లక్ష్మణాఖ్య బ్రహ్మతంత్రం మహాగురుమ్ ॥



# 20) శ్రీ వరద వేదాంత యోగీంద్ర బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి-2



(ఆస్థాన నిర్వాహం - 1673-1676)

ద్వితీయ శ్రీవరదవేదాంతయోగీంద్ర బ్రహ్మతంత్రస్వతంత్రపరకాల మహా దేశికులు క్రీ.శ.1673వ సం.లో పరకాలమఠాభిషిక్తులయ్యారు. వీరు శ్రీవేదాంత లక్ష్మణబ్రహ్మతంత్రస్వామికి తరువాత మఠాన్ని అలంకరించారు. వీరి పాలన కేవలం మూడుఏండ్లపాటు క్రీ.శ.1676వ సం. వరకు సాగింది.

పూర్వాశ్రమంలో వీరు శ్రీనివాసదేశికనామంతో ప్రసిద్ధులు. వీరు సారప్రకాశికా వ్యాఖ్యానకారులైన అప్పలాచార్యస్వామివంశానికి చెందిన వారు, వీరు గొప్ప ప్రతిభాపాండిత్యాలను కలవారై, శ్రీసంప్రదాయాన్ని వృద్ధిచేశారు. మైసూరు ప్రభువు శ్రీచిక్కదేవరాజ ఒడైయార్ వీరి సన్నిధిలో అన్ని శాస్త్రాలను అధ్యయనం చేశాడు. వీరివద్దనే పంచసంస్కారాలను పొందాడు. తమ కుటుంబం సమస్తం ఈ స్వామి సన్నిధిలోనే శ్రీవైష్ణవదీక్షను గ్రహించాలని నియమించాడు. వీరి తనియన్‌లు



శ్రీమద్వరాహమునివీక్షితలబ్ధబోధం
శ్రీతాతయార్య కరుణాపరిణాహపాత్రమ్ ।
వేదాంతలక్ష్మణమునీంద్రపదాబ్జభృంగం
వందే సదా వరదవేదశిరోయతీంద్రమ్ ॥

వేదాంతదేశికశ్రేష్ఠసిద్ధాంతోద్ధార ధూర్వహమ్ ।
వేదాంతసంయమీశానం శ్రయేమ కరుణానిధిమ్ ॥

# 21) శ్రీ మహా పరకాల బ్రహ్మతంత్రస్వతంత్ర స్వామి-1
## ( పెరియ పరకాలస్వామి )



(ఆస్థాన నిర్వాహం - 1676-1737)

శ్రీమహాపరకాల బ్రహ్మతంత్రస్వతంత్రస్వామి (పెరియపరకాలస్వామి) ద్వితీయ వరద వేదాంతబ్రహ్మతంత్రస్వామికి పిమ్మట క్రీ.శ.1676 సం.లో పరకాల

మఠ పట్టాభిషిక్తులయ్యారు. వీరు క్రీ.శ.1655లో అవతరించారు. పూర్వాశ్రమంలో శ్రీ తిరువేంకటాచార్యులుగా ప్రసిద్ధులు. 20వ పట్టాన్ని అలంకరించిన, శ్రీనివాస దీక్షితులుగా పూర్వాశ్రమంలో ప్రసిద్ధులైన ద్వితీయవరదవేదాంత యోగీంద్రబ్రహ్మ తంత్రస్వామి కుమారులు.

వీరు తమ 22వ ఏటనే పరకాలమఠాభిషిక్తులయ్యారు. తమ ఆరాధనా మూర్తులైన లక్ష్మీనారాయణులను మఠంలో వేంచేపు చేసి, లక్ష్మీ హయగ్రీవులతోపాటు ఆరాధించారు. శ్రీరామానుజులవలె, శ్రీదేశికులవలె శ్రీవైష్ణవసంప్రదాయంలో వీరి స్థానం చాలా దొడ్డది అనడంలో సందేహం లేదు. వీరు వెలయించిన పలు ఉద్గ్రంథాలు వీరి పాండిత్యానికి చిహ్నాలు. దక్షిణభారతదేశం అంతా విస్తృతంగా పర్యటించి శ్రీరామానుజ సిద్ధాంతాన్ని ప్రచారం చేయడంద్వారా, పలు ఆలయాలను ఉద్ధరించి, అక్కడ ఆరాధనలను సరిగా నిర్వర్తించేటట్లు చేయడంద్వారా పలు దివ్య దేశాలలో శ్రీదేశికుల అర్చామూర్తులను ప్రతిష్ఠించడంద్వారా వీరు చేసిన కృషి అపారమైనది.

వీరు చతుస్సహస్రవ్యాఖ్యాతగా ప్రసిద్ధులు. నాలాయిరదివ్యప్రబంధాన్ని పూర్తిగా వ్యాఖ్యానించినందువల్ల వీరికి ఈపేరు వచ్చింది. వీరికి స్వప్నంలో తిరుమఙ్గై యాళ్వార్లు సాక్షాత్కరించి, తన నామమైన పరకాలనామాన్ని పెట్టుకోమని వీరిని ఆజ్ఞాపించారు. అందువల్ల వీరికి పరకాలనామం స్థిరపడింది. పెరియపరకాలస్వామిగా వ్యవహరింపబడే వీరు 58 గ్రంథాలను రచించారు. వీరి గ్రంథాలలో నాలాయిర దివ్యప్రబంధ వ్యాఖ్యలు, దేశికప్రబంధంపై వ్యాఖ్యలు యతిప్రతివందన ఖండనం, ఆచార్యావతారఘట్టం, పరకాలాస్థానపద్ధతి, మితప్రకాశిక, సారసంగ్రహం, లక్ష్మీవిభుత్వ - ఉపాయత్వంవంటివి ప్రసిద్ధాలు.

శ్రీ పెరియపరకాలస్వామివారు పరకాలమఠాధిపతులు అయిన తర్వాత ఆ మఠం గొప్ప దశను పొందింది అప్పటి మైసూరుప్రభువు శ్రీదొడ్డ కృష్ణరాజ ఒడైయార్ పరకాలమఠం ప్రధానకార్యాలయాన్ని తిరుపతి నుండి శ్రీరంగపట్టణానికి కూర్చే ప్రయత్నంలో సఫలుడయ్యాడు.

మైసూరుప్రాంతంలో ప్రశాంతవాతావరణం ఉండడంవల్ల, మొగల్ - మహారాష్ట్రప్రభువుల మధ్య తరచు జరిగే యుద్ధాల కారణంగా తిరుమల ప్రాంతంలో



ఏర్పడిన అశాంతిపరిస్థితులను చూచి దొడ్డ కృష్ణరాజ ఒడైయార్ పరకాల స్వామివారిని ఒప్పించి కార్యాలయాన్ని శ్రీరంగపట్టణానికి మార్పించాడు. శ్రీపెరియ పరకాలస్వామి అంగీకరించి కావేరీనదీతీరంలోని (కొప్పల్) మఠంలో నివసించారు.

పెరియపరకాలస్వామి మొగల్ చక్రవర్తి ఔరంగజేబును కలిశారు. మైసూరు ప్రభువులకు రాజగురువులైన శ్రీపరకాలస్వామివారిని ఔరంగజేబు చాలా గౌరవించి, కొన్ని విశేషమైన సత్కారాలను, కానుకలనుకూడా సమర్పించాడు అపుడు పెరియ పరకాలస్వామి ఔరంగజేబు నవాబువద్ద, తాము దక్షిణ భారతంలోని పలు దివ్య దేశాలలో దేశికుల అర్చామూర్తులను ప్రతిష్ఠించి, ఆరాధనను జరిపించడానికి అతని అనుమతిని పొందారని తెలుస్తున్నది. శ్రీ పెరియపరకాల స్వామి సన్నిధిలో పలువురు ప్రభువులు శ్రీవైష్ణవదీక్షను స్వీకరించారు. వారిలో శ్రీదొడ్డకృష్ణరాజ ఒడైయార్, అతని పత్ని కూడా ఉన్నారు. శ్రీదేశికులు గ్రంథాలన్నిటిలో రహస్యత్రయసారం చాలా ఉత్కృష్టమైనదని, పూర్వాచార్యులందఱిలో దేశికులు విలక్షణులని వీరు ప్రబోధించారు. సాక్షాత్తు హయగ్రీవుడే దేశికులై అవతరించారని, శ్రీదేశికుల శ్రీచరణ ద్వయానికి ప్రతినిధియే బ్రహ్మతంత్రస్వతంత్రపరకాల మఠమని, ఆ మఠంలోని ఆచార్యులను ఆ శ్రీచరణాలకు సేవకులని వీరు తెలిపారు.

క్రీ.శ.1737వ సం॥ వరకు సుమారు 61 సం॥లపాటు పరకాలమఠాన్ని నిర్వహించి కాళయుక్తి సంవత్సరం భాద్రపదమాసం బహుళ ప్రథమాతిథిలో పరమ పదాన్ని చేరారు. వీరి తనియన్

విన్యస్తాత్మభరం వరప్రదగురౌ తద్దేశికైర్వీక్షితం
శ్రీవేదాంతయతీంద్ర భూరికృపయా సంప్రాప్తమోక్షాశ్రమమ్ ।
సారార్థామృతలాభవంత మనఘాత్ శ్రీశ్రీనివాసాద్గురోః
వందే శ్రీపరకాలయోగిన మహం వేదాంతవిద్యాగురుమ్ ॥

## 22) శ్రీశ్రీనివాస బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి-2



(ఆస్థాన నిర్వాహం - 1737-1750)

శ్రీమహాపరకాలస్వామివారి తరువాత శ్రీశ్రీనివాస బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి క్రీ.శ.1737వ సం.లో పరకాలమఠాన్ని అలంకరించారు. ప్రభవనామ సంవత్సరం పుష్యమాసంలోని కృత్తికానక్షత్రంలో అవతరించిన వీరు, పూర్వాశ్రమంలో శ్రీవేంకటాచార్యనామంతో ప్రసిద్ధులు. కాళయుక్తిసంవత్సరం భాద్రపద బహుళ ప్రథమాతిథిలో వీరు సన్న్యాసాశ్రమ స్వీకారం చేశారు. భగవద్భాగవతకైంకర్యాన్ని, గ్రంథప్రవచనాదులను విశేషంగా నిర్వహించారు. సుమారు 32 కృతులను రచించారు. లక్ష్మీహయగ్రీవోపాయత్వం, న్యాసప్రకాశిక, న్యాసప్రకాశికా వివృతి, పరకాలమంగళం, పరకాల వైభవప్రకాశిక మొదలైనవి వీటిలో కొన్ని క్రీ.శ. 1751 సం॥ వరకు వీరు 13 ఏండ్ల పాటు మఠనిర్వాహాన్ని చేసి, ప్రజోత్పత్తిసంవత్సరంలో ఆచార్యసన్నిధిని చేరారు. వీరి తనియన్ -

శ్రీమచ్ఛ్రీపరకాలసంయమివరాత్ దత్తాపవర్గాశ్రమ -
శ్రుత్యంతద్వయసారసారథివచోభాష్యార్థసమ్యగ్ధియమ్ ।
శ్రీమత్తాతగురౌ సమర్పితభరం తత్పాదపద్మాశ్రయం
శ్రీవాసం పరకాలయోగితిలకం దాంతం శ్రయామోఽన్వహమ్ ॥



జ్ఞానాంబురాశిపరకాలగురోరవాప్తవేదాంతయుగ్మచరమాశ్రమసంప్రదాయమ్ ।
శ్రీతాతదేశికపదార్పితనైజభారం శ్రీశ్రీనివాసపరకాలగురుం శ్రయామః ॥

## 23) శ్రీవేదాంత బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి-1



(ఆస్థాన నిర్వాహం - 1750-1770)

శ్రీశ్రీనివాస బ్రహ్మతంత్ర స్వామివారి తరువాత శ్రీవేదాంత బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలమహాదేశికులు పరకాలమఠాన్ని క్రీ.శ.1750వ సం.లో అధిష్ఠించి, 20 ఏండ్ల పాటు 1770 వ సం.వరకు పాలించారు. వీరు నందన సంవత్సరంలో క్రీ.శ.1712లో జయమంగళనదీతీరంలోని హోలవనహళ్ళిలో అవతరించారు. ప్రజోత్పత్తి సంవత్సరం భాద్రపదమాసంలో చతుర్థాశ్రమ (సన్న్యాస) స్వీకారం చేశారు. గొప్ప పండితులైన వీరు శ్రీసంప్రదాయాన్ని చాలా ప్రచారం చేశారు. వీరి వ్యక్తిత్వానికి పండితపామరులంతా దాసోహమన్నారు. రెండవ శ్రీకృష్ణరాజ ఒడ్డెయార్ వీరికి పలు కానుకలను సమర్పించాడు. వీరి తనియన్ -

పద్మావాసకలిద్విషన్మునివర శ్రీపాదసేవార్జిత -
శ్రుత్యంతద్వయసారసారథివచస్తాత్పర్యతుర్యాశ్రమమ్ ।
శ్రీద్వేదవతంసయుగ్మవిశదీకారైకబద్ధస్పృహం
శ్రీవేదాంతకలిద్విషం మునివరం సేవే శమాంభోధిమ్ ॥

## 24) శ్రీశ్రీనివాస బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి-3



(ఆస్థాన నిర్వాహం - 1770-1771)

మూడవ శ్రీశ్రీనివాస బ్రహ్మతంత్ర పరకాలస్వామివారు (శ్రీఅభినవ శ్రీనివాస పరకాలస్వామివారు) 1770వ సం.లో శ్రీవేదాంతబ్రహ్మతంత్ర స్వామివారి తరువాత పరకాలమఠాన్ని అధిష్ఠించారు. వీరు 1705వ సం.లో తిరునారాయణ పురంలో జన్మించారు. శ్రీశ్రీనివాసపరకాలస్వామిసన్నిధిలో విద్యాభ్యాసాన్ని చేశారు. గృహస్థులుగా చిరకాలం జీవించి శ్రీసంప్రదాయసేవను చేశారు. వార్ధక్యంలో శ్రీవేదాంత బ్రహ్మతంత్రస్వామి నియమనంతో పరకాలమఠాధీశులయ్యారు. తమ వయస్సు పైబడి, శక్తి సన్నగిల్లినందున శ్రీరామానుజ బ్రహ్మతంత్ర స్వతంత్రపరకాల స్వామి వారిని పరకాలమఠం ఉత్తరాధికారిగా 1771 వసంలో నియమించారు. వీరి తనియన్-

పద్మానివాసపరకాలయతీంద్రలబ్ధ -<br>
సారార్థవేదశిఖరాదిమసంప్రదాయమ్ ।<br>
తత్పాదదత్తభర ముత్తమచిత్తవృత్తిం<br>
శ్రీశ్రీనివాసపరకాలగురుం శ్రయామః



## 25) శ్రీ రామానుజ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1771-1810)

మూడవ శ్రీశ్రీనివాస బ్రహ్మతంత్రస్వామి తరువాత శ్రీరామానుజ బ్రహ్మతంత్ర స్వామి క్రీ.శ.1771వ సం.లో పరకాలమఠానికి అధిపతులయ్యారు. వీరు విరోధి వర్షం మేషమాసం రోహిణిలో బాగేపల్లి గ్రామంలో జన్మించారు. వీరు శ్రీపెరియ పరకాలస్వామికి దగ్గర బంధువైన, కౌండిన్యగోత్రానికి చెందిన తిరుమలాచార్యుల వారి పుత్రులు. కుంభకోణం వెళ్ళి, అక్కడ తిరుమలై కృష్ణమాచార్యులవారి దగ్గర పంచసంస్కారాలను పొందారు. తిరుమలై కృష్ణమాచార్యులవారు పెరియ పరకాలస్వామివారి ప్రత్యక్షశిష్యులు. బ్రహ్మాశ్రమంనుండి వీరు నేరుగా ఉత్తమాశ్రమాన్ని శ్రీనివాస బ్రహ్మతంత్ర స్వామినుండి స్వీకరించారు.

వీరు సన్న్యాసాశ్రమస్వీకారాన్నిచేసి, శ్రీవైష్ణవసంప్రదాయసేవను విశేషంగా చేశారు. శ్రీనివాసపరకాలస్వామి నియమనాన్ని శిరసా వహించి, పరకాలమఠాధిపత్యాన్ని స్వీకరించారు. మైసూరు ప్రాంతంలో అపుడు ఏర్పడిన రాజకీయపరమైన అశాంతివల్ల తిరుమలకు వచ్చారు. ఆ తరువాత కొంతకాలానికి కావేరీనదీతీరంలోని కృష్ణపురానికి పరకాలమఠం ఆస్థానాన్ని మార్చారు. క్రీ.శ.1810 సం.లో ప్రమోదూత సంవత్సరం మీనమాసం షష్ఠీతిథిలో ఆచార్యసన్నిధిని చేరారు. అప్పటికి వీరి వయస్సు

102 ఏండ్లు. వీరు చాలా దూరదృష్టిని కలవారు. పరకాలమఠాన్ని 57 ఏండ్లపాటు నిర్వహించారు. వీరి తనియన్ -

వందేయ శ్రీనిలయపరకాలాత్తవేదాంతయుగ్మం
తత్పాదాబ్జే వినిహితభరం బ్రహ్మతంత్రాత్మతుర్యమ్ ।
శ్రీకృష్ణార్యాదధిగతరథాంగాబ్జ మబ్జాక్షహృత్కం
శ్రీమద్రామావరజపరకాలాభిధం దేశికేంద్రమ్.

## 26) శ్రీ ఘంటావతార బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1810-1837)

శ్రీ ఘంటావతార బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల మహాదేశికస్వామివారు క్రీ.శ.1810 వ సం॥లో పరకాలమఠానికి అధీశులయ్యారు. వీరు శ్రీరామానుజ బ్రహ్మ తంత్రస్వామి తరువాత ఈ మఠాన్ని అలంకరించారు. పినాకినీ (పెన్నా) నదీ తీరం లోని నల్లూరులో ధాతునామ సంవత్సరం పుష్యమాసం ధనిష్ఠా నక్షత్రంలో శ్రీవత్స గోత్రంలో అవతరించారు. వీరి తండ్రి శ్రీకృష్ణమాచార్యులవారు.



వీరు సాంప్రదాయిక గ్రంథాలను శ్రీరామానుజబ్రహ్మతంత్రస్వామి సన్నిధిలో అభ్యసించారు. పాండిత్యంలో వీరు అపరదేశికులుగా ప్రసిద్ధి చెందారు. 20 గ్రంథాలను రచించారు. వీటిలో వ్యాఖ్యా గ్రంథాలు కూడా ఉన్నాయి. పలు దివ్యక్షేత్రాలు విస్తృతంగా పర్యటించి మంగళాశాసనాన్ని చేసి పునరుద్ధరణలను, కైంకర్యాలను చేశారు. తిరునారాయణపురం ఆలయంలోని ఆరాధనాదులను వ్యవస్థీకరించి, పరకాల మఠానికి విశేషమైన ఆర్థికబలాన్ని సమకూర్చడంలో వీరు కారణభూతులయ్యారు. క్రీ.శ.1829 వ సం.లో శ్రీవేదాంత బ్రహ్మతంత్ర స్వామిని పరకాలమఠానికి అధికారిగా అభిషేకించి, తాము విరక్తసన్న్యాసాన్ని గడిపారు. క్రీ.శ.1837 సం. వరకు మఠాధి పతులై వేంచేసి ఉన్నారు. వీరి తనియన్.

రామానుజాదిపరకాలయతీంద్రలబ్ద -
వేదాంతయుగ్మ చరమాశ్రమసంప్రదాయమ్ ॥
శ్రీశింగరార్యగురువీక్షిత మాత్మవంతం
ఘంటావతారపరకాలగురుం శ్రయామః ॥

వేదాంతదేశికేంద్రస్య సిద్ధాంతస్థాపనోత్సుకః
జయతు శ్రీశఘంటాంశ పరకాలగురూత్తమః ॥

## 27) శ్రీ వేదాంత బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1828-1835)

శ్రీఘంటావతార స్వామివారు తమకు ఉత్తరాధికారిగా శ్రీవేదాంత బ్రహ్మ తంత్ర స్వతంత్రస్వామివారిని క్రీ.శ. 1828వ సం॥లో నియమించారు. వీరుకూడా పినాకినీ నదీతీరంలోని నల్లూర్‌లో విరోధికృత్ సంవత్సరంలో శ్రావణమాసం ఉత్తరఫల్గునీ నక్షత్రంలో 1791 సం.లో జన్మించారు. వీరు పిళ్ళాన్‌వంశానికి చెందినవారు. వీరి పూర్వాశ్రమనామం శ్రీరాఘవాచార్యస్వామివారు.

శ్రీరామానుజ స్వామి (25న పట్టం) సన్నిధిలో వ్యాకరణ, నాయవేదాంతాది శాస్త్రాలలో గాఢమైన పాండిత్యాన్ని గడించారు. శ్రీఘంటావతారస్వామి సన్నిధిలో భరన్యాసాన్ని చేశారు. వారి ఆజ్ఞానుసారం శాస్త్రబోధనలో వారికి సహకరించారు. శ్రీఘంటావతారస్వామి వృద్ధులైనందున పరకాలమఠమఠాధికారిగా క్రీ.శ.1828 వ సం॥లో శ్రీరాఘవాచార్యస్వామిని అభిషేకించారు. సన్న్యాశ్రమంలో వీరి పేరు శ్రీవేదాంత బ్రహ్మతంత్రపరకాలస్వామి. వీరు ఎక్కువ కాలం తిరునారాయణపురం లోనే వేంచేసి ఉన్నారు. వీరి పాండిత్యాన్ని, సామర్థ్యాన్ని చూచి పులువురు వీరి శ్రీచరణాలను ఆశ్రయించారు. శ్రీఘంటావతారస్వామి జీవించి ఉండగానే వీరు క్రీ.శ.1836లో పరమపదాన్ని చేరారు. వీరు పరకాల మఠాన్ని 7 ఏండ్లపాటు నిర్వ హించారు. వీరి తనియన్ -



శ్రీమద్రామానుజార్యైః కలిరిపుగురుభిః వీక్షితం బ్రహ్మతంత్ర -
శ్రీమద్ఘంటావతారోత్తమకలిమథనాంఘ్ర్యబ్జ విన్యస్తభారమ్ ।
తద్వీక్షాలబ్ధబోధాంచలయుగళతురీయాశ్రమం శాంతిభూమిం
వేదాంతబ్రహ్మతంత్రాభిధకలిమథనాచార్యవర్యం ప్రపద్యే ॥

## 28) శ్రీ శ్రీనివాస బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి-4



(ఆస్థాన నిర్వాహం - 1835-1860)

చతుర్థ శ్రీశ్రీనివాసబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామివారు శ్రీవేదాంత బ్రహ్మతంత్రస్వామికి తరువాత పరకాలమఠాన్ని క్రీ.శ.1835వ సం.లో అధిష్ఠించారు. వీరు క్రీ.శ.1790వ సం॥లో ఆషాఢశుద్ధపూర్ణిమ, పూర్వాషాఢానక్షత్రంలో పిళ్ళాన్ వంశానికిచెందిన తాతాచార్యస్వామివారికి కుమారులుగా అవతరించారు. వీరి పూర్వాశ్రమనామం శ్రీకృష్ణమాచార్యస్వామివారు

చిన్నవయస్సులోనే వీరు సకలశాస్త్రాలలో అద్వితీయపాండిత్యాన్ని గడించారు. శ్రీ ఘంటావతారస్వామిసన్నిధిలో వేదాంతశాస్త్రాలను అధికరించి, శ్రీవేదాంత బ్రహ్మతంత్రస్వామినుండి సన్న్యాసాశ్రమస్వీకారాన్ని చేశారు. పలువురు వీరికి శిష్యులై ఆశ్రయించారు. వీరిలో శ్రీముమ్మడి కృష్ణరాజ ఒడైయార్ ఒకరు.

వీరు క్రీ.శ.1846 సం. నుంచి పలు ఏండ్లపాటు దిగ్విజయయాత్రను సాగించి, శ్రీరామానుజ సంప్రదాయాన్ని ప్రచారం చేశారు. పలు చోట్ల పరకాలమఠాలను, ఆలయాలను నిర్మించారు. గీతాభాష్యంపై వీరు అయిదు కృతులను రచించినట్లు తెలుస్తున్నది. 25 సం.ల పాటు మఠనిర్వాహాన్ని చేసి క్రీ.శ.1860లో పరమపదించారు. వీరి తనియన్ -

శ్రీద్ఘంటావతారోత్తమకలిమథనావాప్తసత్సంప్రదాయ -
శ్రీభాష్యశ్రీరహస్యత్రయసృతిమదసీయాంఘ్రివిన్యస్తభారమ్ ।
వేదాంతబ్రహ్మతంత్రాభిధకలమథనాల్లబ్ధతుర్యాశ్రమం శ్రీ -
వాసబ్రహ్మతంత్రాదిమపదపరకాలాఖ్యమాచార్య మీడే ॥

## 29) శ్రీ శ్రీనివాస దేశికేంద్ర బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1860-1873)

పరకాలమఠం 29వ పట్టాన్ని శ్రీశ్రీనివాసదేశికేంద్ర బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామివారు క్రీ.శ.1860లో అధిష్ఠించారు. వీరు క్రీ.శ.1802వ సం.లో మార్గశిర



మాసం అశ్వినీనక్షత్రంలో శ్రీఆత్రేయ నరసింహాచార్యస్వామివారికి కుమారులుగా అవతరించారు.

వీరు ప్రాథమికవిద్యాభ్యాసాన్ని తమ పితృపాదాలసన్నిధిలో చేసి, తరువాత శ్రీఘంటావతారస్వామిసన్నిధిలో పంచసంస్కారాలను, గ్రంథకాలక్షేపాన్ని చేశారు. అన్ని శాస్త్రాలలో పాండిత్యాన్ని గడించిన వీరు భగవద్విషయంలో అత్యంతం విలక్షణమైన వైదుష్యాన్ని కలవారు. శ్రీనివాసబ్రహ్మతంత్ర పరకాలస్వామివారినుండి సన్న్యాసాశ్రమస్వీకారాన్ని చేశారు. పిళ్ళాన్ అపరావతారంగా వీరు సంభావింపబడేవారు.

కంచి, శ్రీరంగం, తిరుమల మొదలైన పలు దివ్యదేశాలను సేవించి, అక్కడ సిద్ధాంతవ్యాప్తిని చేశారు. ధాతుసంగ్రహం, అలంకారసంగ్రహం, సుధీవిలోచన సంగ్రహం, పూర్వప్రయోగసంగ్రహంవంటి పలు కృతులను రచించారు. వీరు 13 సం.లపాటు మఠాధిపత్యాన్ని నిర్వహించి, క్రీ.శ.1873లో పరమపదాన్ని చేరారు. వీరి తనియన్.

శ్రీమద్ఘంటావతారోత్తమకలిమథనాల్లబ్ధచక్రాంకభాష్యం
వేదాంతబ్రహ్మతంత్రోత్తమకలిమథనశ్రీపదన్యస్తభారమ్ ।
శ్రీవాసబ్రహ్మతంత్రోత్తమకలిమథనోపాత్త తత్త్వార్థతుర్యం
వందే శ్రీబ్రహ్మతంత్రం కలిమథనరమావాససద్దేశికేంద్రమ్ ॥

# 30) శ్రీ రంగనాథ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1873-1885)

శ్రీరంగనాథబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామి వారు క్రీ.శ.1873వ సం.లో పరకాలమఠాన్ని 30వ యతీశ్వరులుగా అలంకరించారు. వీరు శ్రీశ్రీనివాస దేశికేంద్ర స్వామి తరువాత ఈమఠానికి అధిపతులయ్యారు. కడపసమీపంలోని రాయుల పాడులో (బాహుదానదీతీరంలో) క్రీ.శ.1812 వ సం.లో వైశాఖమాసం విశాఖా నక్షత్రంలో అవతరించారు. వీరి తండ్రి వాధూలనరసింహాచార్యస్వామివారు వీరి పూర్వాశ్రమనామం శ్రీరంగాచార్యస్వామి. చిన్నతనంనుండి వీరి ప్రతిభా వ్యుత్పత్తులు విలక్షణమైనవి.

వీరు ఉత్తరభారతదేశాన్ని విస్తృతంగా పర్యటించి, పలు వాదాలలో గెలిచి, అక్కడ శ్రీరామానుజ సిద్ధాంతాన్ని వ్యాపింపజేశారు. రహస్యత్రయసార సంగ్రహం, సుదర్శనవాదం, పురుషసూక్తభాష్యంవంటి పలు గ్రంథాలను విరచించారు. మహావిద్వాంసులైన పండితరత్నం కస్తూరిరంగాచార్యస్వామివారు వీరి శిష్యులే. వీరివద్దనే రంగాచార్యస్వామి శాస్త్రాధ్యయనాన్ని చేశారు. వీరు క్రీ.శ.1885 వరకు 12 ఏండ్లపాటు మఠాన్ని నిర్వహించారు. వీరి తనియన్.



శ్రీఘంటాంశాత్తచక్రాంకసముదితహృదం ప్రాప్తవేదాంతయుగ్మం
వేదాంతార్యాదధీతాహితనిగమభరం శ్రీనివాసాంఘ్రియుగ్మాత్ ।
శ్రీమచ్ఛ్రీవాససద్దేశికవరపురుహూతాత్తతుర్యాశ్రమం తం
వందే శ్రీరంగనాథం కలిమథనగురుం బ్రహ్మతంత్రాద్యశబ్దమ్ ॥

శ్రీరామానుజసిద్ధాంతస్థాపకో జయతా దయమ్ ।
రంగనాథబ్రహ్మతంత్ర పరకాలయతీశ్వరః ॥

# 31) శ్రీ కృష్ణ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1885-1915)

శ్రీరంగనాథ పరకాలస్వామివారికి తరువాత శ్రీకృష్ణబ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామి (పూర్వాశ్రమనామం శ్రీకృష్ణమాచార్యులువారు) క్రీ.శ.1885లో పరకాల మఠాన్ని అధిష్ఠించారు. ఈ స్వామి పినాకినీతీరంలో గల ఆమిదేల అనే గ్రామంలో జన్మించారు. వీరు మహావిద్వాంసులైన శ్రీతాతాచార్యులవారి ద్వితీయపుత్రులు.

శ్రీతాతాచార్యులవారు సారప్రకాశికాకర్తలైన అప్పలాచార్యుల వారి వంశానికి చెందినవారు. శ్రీకృష్ణమాచార్యులవారు (తరువాత శ్రీకృష్ణబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి) శాలివాహనశకం 1761వ సం॥లో వికారి నామ వర్షం జ్యేష్ఠమాసం శ్రవణానక్షత్రంలో జన్మించారు. శ్రీతాతాచార్యులవారికి శ్రీనివాస దేశికేంద్ర బ్రహ్మతంత్ర పరకాలస్వామివారి ఆశీర్వాదంవల్ల శ్రీకృష్ణమాచార్యులవారు పుత్రులుగా జన్మించారని ప్రసిద్ధి.

శ్రీశ్రీనివాసబ్రహ్మతంత్రపరకాలస్వామి సన్నిధిలో పంచసంస్కారాలను పొందిన వీరు వారివల్ల హయగ్రీవమంత్రోపదేశాన్ని పొందారు. చాలా చిన్నవయస్సులోనే వీరు వ్యాకరణసాహిత్యాలంకారాది శాస్త్రాలలో గొప్ప పాండిత్యాన్ని గడించారు. ఆ వయస్సులోనే **"పరకాల గురువిజయ"**మనే కావ్యాన్ని రచించి, కవిసార్వభౌమ బిరుదాన్ని పొందారు. శ్రీశ్రీనివాసబ్రహ్మతంత్రస్వామివారి సన్నిధిలోనే గ్రంథ చతుష్టయాన్ని అధ్యయనం చేశారు. తరువాత గృహస్థాశ్రమంలో ప్రవేశించారు. ఆనెగుండి ప్రభువు శ్రీతిరుమలరాయని ఆహ్వానంమేరకు ఆ సంస్థానానికి వెళ్ళి అక్కడ కొంతకాలం ఉన్నారు. ఆ సమయంలోనే శ్రీరంగరాజవిజయమనే కృతిని రచించారు. అక్కడనుండి శ్రీరామభూపాలుని ఆహ్వానాన్ని మన్నించి గద్వాల సంస్థానానికి పోయి, కార్తికోత్సవదీపికవంటి పలు గ్రంథాలను రచించారు. ఆ తరువాత, ఆత్మకూరుప్రభువు ముక్కర శ్రీసీతారామభూపాలుని పిలుపుపై అక్కడకు వెళ్ళారు. అక్కడ ఉన్న సమయంలో శ్రీశ్రీనివాసవిలాసమనే కృతిని రచించారు. తదనంతరం వనపర్తి సంస్థానాధీశుడు శ్రీరామేశ్వరరావు ఆహ్వానంపై ఆ సంస్థానాన్ని అలంకరించి, అక్కడ **"చపేటహతిస్తుతి, ఉత్తర రంగనాథ మాహాత్మ్యం, శ్రీరామేశ్వరవిజయం"** మొదలైన గ్రంథాలను నిర్మించారు. శ్రీకృష్ణమాచార్యస్వామివారు తరువాత కొల్హాపూర్‌రాజు శ్రీవేంకటనాథరావు పిలుపును అంగీకరించి అక్కడకు విజయం చేశారు. **నృసింహవిలాసం, మదన గోపాలమాహాత్మ్యం** మొదలైన గ్రంథాల రచన అక్కడే జరిగింది. తరువాత కొంత కాలం వనపర్తిలో స్థిరపడి, ఎన్నో కృతులను విరచించారు. తమను ఆశ్రయించిన పలువురు పండితులకు శాస్త్రజ్ఞానభిక్షను పెట్టారు. ఒకానొక సమయంలో శ్రీరంగపట్టణాన్ని దర్శించి, అక్కడ శ్రీశ్రీనివాస దేశికేంద్ర బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామివారి సన్నిధిలో భరన్యాసాన్ని చేశారు. ఈ సమయంలో ఆచార్య వేదపదస్తవం అనే కృతిని రచించారు. తరువాత శ్రీదేశికేంద్ర స్వామివారు తిరుపతి,



కంచి, తిరువళ్ళూర్, శ్రీరంగం మొదలైన ప్రాంతాలలో చేసిన దిగ్విజయయాత్రను వర్ణించే ఉత్తరపరకాలదిగ్విజయమనే చంపూకావ్యాన్ని రచించారు. అపుడే శ్రీదేశికేంద్రస్వామివారు శ్రీకృష్ణమాచార్యులవారిని చూచి, ఎప్పుడో ఒకనాడు తప్పక వీరు పరకాలమఠాన్ని అలంకరిస్తారని తెలిపారు. వనపర్తికి తిరిగివచ్చిన తరువాత శ్రీకృష్ణమాచార్యులవారు తమ శిష్యులకు పురాణప్రవచనాన్ని చేశారు. అపుడే శ్రీవీరరాఘవాచార్య స్వామివారు శ్రీభాగవతంపై వ్రాసిన మునిభావప్రకాశికావ్యాఖ్య అనే అపూర్వవ్యాఖ్యానగ్రంథాన్ని వనపర్తి సంస్థానంద్వారా ముద్రింపజేశారు. కొన్ని సంవత్సరాల తరువాత, శ్రీరంగనాథ పరకాలస్వామివారు తాము చాలా వృద్ధులైనందున శ్రీకృష్ణమాచార్యులవారిని మఠాన్ని అలంకరించవలసినదని ఆహ్వానించి, వారికి ఆవశ్యకాలైన మంత్రాలను, ఉపదేశాలను చేసి, మఠాన్ని అధిష్ఠించడానికి తగిన యోగ్యతను కల్గించారు. శ్రీరంగనాథస్వామివారి ఆదేశం, అభిమతంమేరకు శ్రీకృష్ణమాచార్యస్వామివారు శ్రీకృష్ణబ్రహ్మతంత్ర స్వతంత్ర **పరకాలమహాదేశిక** నామంతో పరకాలమఠాన్ని 1885వ సం.లో అలంకరించారు. కొద్దికాలంలోనే వారు పరకాల మఠానికి పటిష్ఠమైన ఆర్థికబలం కలిగే రీతిలో చేయగలిగారు. వీరి కాలంలనే మఠంలోని శ్రీలక్ష్మీహయగ్రీవస్వామికి వజ్ర డోలోత్సవం జరుపబడింది. పలువురు సంస్థానాధీశులు, ప్రభువులు వీరి సన్నిధిలో పంచసంస్కారాలను పొంది, భరన్యాసాలను చేశారు. శ్రీస్వామివారి ఆదేశంమేరకు రాజధానిలోని మఠం పునర్నిర్మాణం కూడా చేయబడింది. డెబ్బైకి మించిన సంఖ్యలో వీరు రచించిన కృతులలో పలు కృతులు చంపూ, నాటక, స్తోత్ర, కావ్య, ధర్మశాస్త్ర, వేదాంత, వ్యాఖ్యాన, అలంకార, సంగీత, ఆహ్నిక, ప్రతివాది నిరసనాదిరూపాలు. చాలా దీర్ఘదృష్టిని కల్గిన వీరు తమకు పిమ్మట మఠాన్ని అధిష్ఠించే యోగ్యతను కల్గినవారినికూడా నిర్ణయించారు. క్రీ.శ.1915 సం॥ల వరకు 30 సంవత్సరాలపాటు మఠాన్ని అలంకరించిన వీరు క్రీ.శ.1915వ సం॥లో పరమపదాన్ని చేరారు. వీరి తనియన్.

శ్రీవాసబ్రహ్మతంత్రాభిధకలిమథనావాప్తచక్రాంకభావం
శ్రీవాసే దేశికేంద్రే కలిమథనగురౌ వర్పితాత్మీయభావమ్ ।
రంగేంద్రబ్రహ్మతంత్రాదిమపదకలిజిత్ దేశికేంద్రాత్తతుర్యం
శ్రీకృష్ణబ్రహ్మతంత్రాగ్రిమపద పరకాలార్యవర్యం శ్రయామి ॥

## 32) శ్రీ వాగీష బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1915-1925)

శ్రీవాగీశ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామివారు శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాలస్వామివారికి తరువాత పరకాలమఠాన్ని క్రీ.శ.1915వ సం.లో అధిష్ఠించారు. ప్రసిద్ధపండితవంశానికి చెందిన వీరు గద్వాలసంస్థానంలో విద్వత్సభాధ్యక్షులై వెలిగారు.

వ్యాకరణశాస్త్రంలో వీరి పాండిత్యం అసమానం. అపరపాణినిగా ప్రసిద్ధి కెక్కారు. దర్శనాలలోకూడా వీరి వైదుష్యం చాలా గొప్పది. ఎక్కడ ఏ సభలలో వాదించినా వీరిదే పై చేయి. వీరు యోగశాస్త్రనిపుణులు. గొప్ప యోగశక్తిని కలవారుగా ప్రసిద్ధి చెందారు. పలుచోట్లకు దిగ్విజయయాత్రలను చేశారు.

వీరు ఏడు గ్రంథాలను వ్యాకరణ, ధర్మశాస్త్రాలపై రచించారు. గద్వాల, వనపర్తి, మైసూరుసంస్థానాధీశాలకు వీరు శ్రీమద్రహస్యత్రయసారాన్ని ప్రవచనం చేశారు. వారు వీరి సన్నిధిలోనే భరన్యాసాన్ని చేశారు. పరకాలమఠాన్ని క్రీ.శ.1925 సం. వరకు 10 ఏండ్లపాటు నిర్వహించారు. వీరి తనియన్ -

శుభగుణనిధిం శ్రీకృష్ణబ్రహ్మతంత్రకలిద్విషత్
గురువరకృపాదీవ్యచ్చక్రాంకభాష్యభరార్పణమ్ ।
తదనఘకృపారాజన్మోక్షాశ్రమం కలయామహే
వశిన మనఘం వాగీశబ్రహ్మతంత్రకలిద్విషమ్ ॥



## 33) శ్రీమదభినవ రంగనాథ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1925-1967)

శ్రీవాగీశబ్రహ్మతంత్రస్వామికి తరువాత శ్రీమదభినవరంగనాథబ్రహ్మ పరకాలస్వామివారు క్రీ.శ.1925 సం.లో పరకాలమఠాభిషిక్తులయ్యారు. వీరు క్రీ.శ.1884 వ సం.లో ధారణనామసంవత్సరం ఆషాఢమాసం పునర్వసునక్షత్రంలో హరిత గోత్రులైన ఆసూరి రాఘవాచార్యస్వామివారికి కుమారులుగా అవతరించారు. చిన్నతనంలో తమ మాతామహులైన రాఘవాచార్యస్వామి సన్నిధిలో విద్యాభ్యాసాన్ని చేశారు.

శ్రీకృష్ణబ్రహ్మతంత్రపరకాలస్వామి సన్నిధిలో పంచసంస్కారాలను పొంది, వారివద్దనే శ్రీభాష్యాన్ని అధికరించారు. శ్రీకృష్ణ బ్రహ్మతంత్రస్వామి వీరిని కస్తూరి రంగాచార్యస్వామివారికి అప్పగించి, తీర్చిదిద్దమన్నారు. రంగాచార్యస్వామివారి శిక్షణలో వీరు సకలశాస్త్రాలలోను పరిపూర్ణపాండిత్యాన్ని సంపాదించి, ఆహితాగ్నులై వెలుగొందారు. శ్రీవరదరామానుజముని సన్నిధిలో భరన్యాసాన్ని చేశారు. **"వైరాగ్యాచార్యవారిధి"**గా పేరు పొందారు. వేదాంతశాస్త్రంలో లోతైన పాండిత్యాన్ని కలవారు వీరు. వీరి జ్ఞానవైరాగ్యాలను చూచి అందఱు వీరికి వశులయ్యారు. పరకాల మఠానికి చెందిన పలుసంస్థల అభివృద్ధికి వీరు హేతుభూతులు. తిరుపతి, రేవా,

అలహాబాద్, కంచి, సత్యకలం, ఆళ్వార్ తిరునగరి, తిరువహీంద్రపురం, రామనాథ పురం, దర్భశయనం, తిరుక్కుఱుంగుడి, పుష్కరం, బదరీనాథ్, ప్రయాగ మొదలైన చోట్లలో సిద్ధాంతవ్యాప్తిని చేశారు.

వీరు వేదపాఠశాలను స్థాపించి నిర్వహించడమేకాక, ప్రతిఏడు **"వేదాంత దేశికవిహారసభ"** అనే పేరుతో ఆధునిక విశ్వవిద్యాలయాల శైలిలో, ప్రాచీనవిద్వత్ సదస్సుల శైలిలో నిర్వహించారు. సంప్రదాయానికి చెందిన పలు గ్రంథాలను ముద్రించే బాధ్యతనుకూడా చేపట్టారు. హయశిరోపాఖ్యానం, తత్త్వముక్తా కలాపవ్యాఖ్యానం, గూఢార్థ సంగ్రహం (శ్రీభాష్యంపై వ్యాఖ్యానమ్), వేదార్థసంజీవనం, త్రయ్యంతసారామృతం, రత్నమాలాస్తోత్రం, ఔపనిషదమణిహారం, రామానుజ మతాదర్శం, పాదుకాస్తుతి, ఇంకా పన్నెండు గ్రంథాలను రచించారు.

పలు సంవత్సరాలపాటు పరకాలమఠాన్ని నిర్వహించిన ఈ స్వామివారు శ్రీరామానుజ సంప్రదాయానికి చెందిన గొప్ప ఆచార్యులలో ఒకరుగా పేరుపొందారు. పలువురు వీరిని ఆశ్రయించి తరించారు. పరకాలమఠాన్ని అలంకరించిన 34వ, 35వ యతీశ్వరులు, ప్రస్తుత మఠాధిపతులైన అభినవ వాగీశబ్రహ్మతంత్రస్వామి - అందఱు వీరిని ఆశ్రయించినవారే. శ్రీపౌండరీకపురం శ్రీమదాండవన్ శ్రీమద్గోపాల దేశికమహాదేశికులుకూడా వీరి శిష్యులే. అనుష్ఠానంలో ఏమాత్రం లోపాన్ని సహించలేని స్వభావం వీరిది.

శ్రీమాన్ కోటికన్యాదానం శ్రీకృష్ణతాతాచార్యస్వామివారు వీరి వైభవాన్ని **"నవ్యరంగస్తుతి"** అనే అద్భుతకృతితో ప్రస్తుతించారు. క్రీ.శ.1966 సం. వరకు 41 సం.ల పాటు వీరు పరకాలమఠాన్ని పాలించారు. వీరి తనియన్ -

**శ్రీకృష్ణబ్రహ్మతంత్రోత్తమకరుణావాప్తచక్రాంకభాష్యం**
**వైరాగ్యాచార్యవార్ధేః వరదపదముఖే లక్ష్మణే న్యస్తభారమ్ ।**
**శ్రీవాగీశాత్తతుర్యం శరీరరిపుయతిరాడ్వేదచూడార్యమూర్తిం**
**నూత్నం శ్రీరంగనాథం కలిరిపుమనఘం బ్రహ్మతంత్రం శ్రయామః ॥**
**శ్రీతురగవదనపాదూసంతతపరిచరణమాత్రపరమార్థః ।**
**జయతు శ్రీమాన్ అభినవరంగేంద్రబ్రహ్మతంత్రపరకాలః ॥**



# 34) శ్రీమదభినవ శ్రీనివాస బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామి



(ఆస్థాన నిర్వాహం - 1967-1972)

శ్రీఅభినవశ్రీనివాస బ్రహ్మతంత్రపరకాలస్వామివారు శ్రీఅభినవరంగనాథ స్వామివారికి తరువాత పరకాలమఠాధీశులయ్యారు. క్రీ.శ.1967వ సం.లో పరకాల మఠాన్ని అలంకరించారు. మైసూర్‌నగరంలో జయనామ సంవత్సరం, కార్తికమాసం భరణి నక్షత్రంలో మహావిద్వాన్ తర్కతీర్థం, పండితరత్నం, కస్తూరి రంగాచార్యస్వామి వారి జ్యేష్ఠపుత్రులుగా అవతరించిన వీరి పూర్వాశ్రమంలో పేరు కస్తూరి శ్రీనివాసరంగా చార్యస్వామివారు.

వ్యాకరణ, తర్క, మీమాంసాదిసామాన్య శాస్త్రాలలో సంస్కృత పాఠశాలలో అధ్యయనం చేసి శ్రీ లక్ష్మీపురం శ్రీనివాసాచార్యస్వామివారి సన్నిధిలో ఆగమశాస్త్రాన్ని అధికరించారు. లక్ష్మీపురం శ్రీనివాసాచార్యస్వామివారు కస్తూరి రంగాచార్యస్వామి వారి శిష్యులు. కస్తూరి శ్రీనివాసరంగాచార్యస్వామివారు పరకాల మఠానికి చిరకాలం శ్రీకార్యకర్తగా కార్యభారాన్ని నిర్వహించారు. పాంచరాత్రాగమ శాస్త్రంలో పలువురిని శిక్షణను ఇచ్చారు. పలుచోట్ల పాంచరాత్రాగమశాస్త్రానుసారంగా ఆరాధన నిర్వహించే

ఏర్పాటుచేశారు. ఆంధ్రదేశంలో, కర్ణాటకలో పలు చోట్ల దిగ్విజయయాత్రను చేసి, మంగళాశాసనం చేశారు. సుమారు 5 ఏండ్లపాటు క్రీ.శ.1972 వరకు పరకాలమఠాన్ని అలంకరించారు.

శ్రీకృష్ణబ్రహ్మతంత్రాభిధ కలిమథనాల్లబ్ధచక్రాంకభాష్యం
నవ్యశ్రీరంగనాథే కలిమథనగురా వర్పితాత్మీయభారమ్ ।
తద్వీక్షాలబ్ధతుర్యం హయవదనపదత్రాణసేవాధురీణం
ధ్యాయేయం బ్రహ్మతంత్రం కలిమథనగురుం శ్రీనివాసం నవీనమ్ ॥
శ్రీమలక్ష్మీహయగ్రీవపాదుకాసేవకో వశీ
జీయాన్నవ్యశ్రీనివాసపరకాలగురూత్తమః ॥

## 35) శ్రీమదభినవరామానుజ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల యతీంద్రులు ( 1971-1992 )



(ఆస్థాన నిర్వాహం - 1971-1992)

శ్రీమదభినవరామానుజ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల మహాదేశికులు కర్ణాటకరాష్ట్రంలో చిక్కబళ్ళాపూర్ గ్రామంలో పింగళవర్షం భాద్రపదమాసం శ్రవణానక్షత్రంతో కూడిన ఏకాదశినాడు 14-9-1917వ తేదీన అవతరించారు. ఇది వేదాంతదేశికుల జన్మదినం కూడా. వీరి తల్లిదండ్రులు - శ్రీమాన్ తిరుమలై



రంగాచార్యులవారు, సాధ్వీమణి చిన్నమ్మాళ్ దంపతులు. వీరి మాతామహుల వంశం పరకాలమఠం 29వ పట్టాన్ని అలంకరించిన పరకాలస్వామివారి వంశానికి చెందినది. తిరుమలై కృష్ణమాచార్యులవారి సన్నిధిలో వేదాధ్యయనాన్ని, ప్రాథమిక సంస్కృత భాషాపరిచయాన్ని, సంప్రదాయపరిజ్ఞానాన్ని వీరు పొందారు. అభినవ రంగనాథ పరకాలయతీంద్రుల సన్నిధిలో పంచసంస్కారాలను పొందారు. మైసూర్‌లో జరిగే పండిత పరీక్షలలో నెగ్గి వేదవిద్వాన్, శాస్త్రవిద్వాన్ మొదలైన బిరుదులను పొందారు.

వీరికి చిన్నతనంలోనే వివాహం జరిగింది. వీరు అభినవరంగనాథ పరకాల యతీంద్రుల సన్నిధిలోనే శ్రీభాష్యాది గ్రంథచతుష్టయకాలక్షేపాన్ని అధికరించారు. శ్రీరంగంలో విలసిల్లిన శ్రీశ్రీగోపాల దేశికయతీంద్ర మహాదేశికులు మొదలైన వారు వీరికి సతీర్థులే. ఆరీతిలోనే ఉవే. వల్లీపురం మాధవాచార్యులవారు, ఉ.వే. కొత్తిమంగళం వరదాచార్యులవారు ప్రభృతులుకూడా వీరికి సతీర్థులు.

వీరు పన్నెండు సంవత్సరాలపాటు అవిచ్ఛన్నంగా శ్రీపరకాలమఠంలోని శ్రీ లక్ష్మీహయగ్రీవస్వామి ఆరాధనను చేశారు. ప్రతిదినం సహస్రనామాలతో తులసీ అర్చన చేసేవారు. హాసన్, చింతామణి, విజయనగరం మొదలైన ప్రదేశాలలోని కళాశాలలలో సంస్కృతాధ్యాపకపదవిని నిర్వహించారు. ద్రావిడం, తెలుగు, కన్నడం, ఆంగ్లం మొదలైనభాషలలోకి పలు సంప్రదాయగ్రంథాలను అనువదించి ప్రచురించారు.

విరోధికృత్ సంవత్సరం 3-6-1971 వ తేదీన వీరు 35వ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలదివ్యస్థాన యతీంద్రులైన అభినవశ్రీనివాస పరకాలస్వామివారిచేత అనుగ్రహింపబడి పరకాలమఠాభిషిక్తులయ్యారు. తురీయాశ్రమంలో వీరి నామం **"శ్రీమదభినవరామానుజ బ్రహ్మతంత్రపరకాలస్వామివారు".**

వీరు సంస్కృత భాషలో పలు స్వతంత్రగ్రంథాలను రచించారు. **(1)**బ్రహ్మ సూత్ర భాష్యవివరణం, **(2)** గూఢార్థ సంగ్రహదర్పణం మొదలైనవి వీరి కృతులలో కొన్ని. పలు దిక్కులలో తీర్థయాత్రలను చేసి ద్రావిడ, కర్ణాటక, ఆంధ్ర, మహా రాష్ట్రాది దేశాలలో కూడ హయగ్రీవ స్వామి అర్చామూర్తి ప్రతిష్ఠాదులను, నూతన మఠభవనాల నిర్మాణాలను, పురాతన పరకాలమఠభవనాల జీర్ణోద్ధారణలను చేశారు. తూప్పుల్ దివ్యదేశంలో వేంచేసి ఉండే నిగమాంతమహాదేశికుల అర్చావిగ్రహానికి

స్వర్ణకవచం, బంగారు ఊయెల, తేరు మొదలైనవానిని వీరు సభక్తికంగా నిర్మింపజేసి సమర్పించారు.

21 సం॥ల పాటు పరకాలమఠాన్ని గొప్పగా నిర్వహించారు. ప్రస్తుతం మఠాధీశులై వేంచేసి ఉండే అభినవ వాగీశ బ్రహ్మతంత్ర స్వతంత్ర మహాదేశికులకు, శ్రీశ్రీశ్రీరంగక్రియ మహాదేశికులకు వీరే సన్న్యాసాశ్రమ గురువు.

వీరి తనియన్

నూత్నశ్రీరంగనాథాంఘ్రిమపదకలిజిల్లబ్ధచక్రాంకనశ్రీ-
త్రయ్యంతద్వంద్వతత్త్వం తదనఘచరణే న్యస్తభారం యతీంద్రాత్ ।
ప్రత్యగ్రశ్రీనివాసాత్ సమధిగతతురీయాశ్రమం సంశ్రయామో
నవ్యం రామానుజాఖ్యం కలిమథనగురుం బ్రహ్మతంత్రస్వతంత్రమ్ ॥

(అభినవశ్రీరంగనాథ పరకాల మహాదేశికుల వలన పంచసంస్కారమేనే సిరిని పొందినవారు, వారి సన్నిధిలోనే వేదాంత తత్త్వాన్ని తెలిసినవారు, వారివద్దనే భరన్యాసాన్ని చేసినవారు, అభినవశ్రీనివాస బ్రహ్మతంత్రపరకాల మహాదేశికుల వల్ల సన్యాసాశ్రమాన్ని స్వీకరించినవారైన అభినవరామానుజ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల మహాదేశికులను ఆశ్రయిస్తున్నాము.)

**లక్ష్మీహయాస్యపాదూవరివస్యైకాంతమానస స్వతతమ్ ।**
**జయతు శ్రీమానభినవరామానుజసంయమీంద్రపరకాల ౧ ॥**

(లక్ష్మీహయగ్రీవుల శ్రీచరణవరివస్యలోనే ఎల్లప్పుడూ లగ్నమైన మనస్సును కలవారైన శ్రీమదభినవ రామానుజ బ్రహ్మతంత్ర పరకాలస్వామివారు వర్ధిల్లాలి.)





## 36) శ్రీఅభినవవాగీశ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల మహాదేశికులు (వర్తమాన జీయర్‌స్వామివారు)



( ఆస్థాన నిర్వాహం - 1992- )

అభినవరామానుజ పరకాలమహాదేశికుల తరువాత అభినవవాగీశ బ్రహ్మ తంత్రపరకాల మహాదేశికులు పరకాలమఠాన్ని అధిష్ఠించారు.

ఈస్వామివారి పూర్వాశ్రమనామం శ్రీనివాసాచార్యులవారు. వీరు పండిత వంశంగా ప్రసిద్ధి చెందిన స్వచ్ఛందవంశంలో అవతరించారు. వరాహజయంతినాడు రేవతీనక్షత్రంలో వీరి అవతారం జరిగింది. వీరు ఆజన్మతపస్వి. చిన్నతనంలోనే చాలా గొప్ప మంత్రసిద్ధిని పొందారు. శ్రీమదభినవ రంగనాథపరకాల స్వామివారి సన్నిధిలో ప్రసిద్ధిని, ప్రాముఖ్యాన్ని పొందిన వ్యక్తులలో ఒకరు. శ్రీమదభినవ రామానుజస్వామి వారి సన్నిధిలోనే వీరు పలుఏండ్లు గ్రంథకాలక్షేపాన్ని చేశారు. పరకాల మఠసంప్రదాయాన్ని, పద్ధతులను సమగ్రంగా ఆకళింపు చేసికొన్న అనుభవశాలి వీరు.

శ్రీమదభినవ రామానుజస్వామివారు తమ తిరుమేని ఆరోగ్యం క్షీణించి నపుడు, శ్రీనివాసాచార్యులవారిని పరకాలమఠాధిపత్యాన్ని స్వీకరించవలసినదిగా

ఆహ్వానించారు. వారి ఆదేశం, ఆహ్వానంమేరకు శ్రీనివాసాచార్యులవారు **3-3-1992**వ తేదీన పరకాల మఠాధీశులుగా పట్టాభిషిక్తులయ్యారు. వీరి సన్యాసాశ్రమ స్వీకారం శ్రీమదభినవరామానుజస్వామి, శ్రీరంగప్రియస్వామివార్ల సాన్నిధ్యంలో జరిగింది.

ఆనాటినుండి అభినవవాగీశ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామిగా ప్రసిద్ధి చెందిన ఈ స్వామి లక్ష్మీహయగ్రీవస్వామి కైంకర్యంలోను, పూర్వాచార్యుల సేవలోను అవిశ్రాంతంగా శ్రమిస్తున్నారు. ప్రతిరోజు పరకాలమఠంలో జరిగే అన్ని విశేషోత్సవాలు చాలా వైభవంగా, సంప్రదాయ సిద్ధంగా స్వామివారి నిర్దేశానుసారంగా నిర్వహింపబడుతున్నాయి. వీరి సన్నిధిలో వేలాదిమంది భక్తులు శ్రీవైష్ణవదీక్షను స్వీకరించారు. ఎంతోమంది శిష్యులు వీరి సన్నిధిలో గ్రంథకాలక్షేపాన్ని చేసిన భాగ్యాన్ని పొందారు. వీరి నిర్దేశకత్వంలో వందకుపైగా పూర్వాచార్యగ్రంథాలు ప్రచురింపబడ్డాయి.

శ్రీమదభినవ రామానుజమహాదేశికులు ఆశించిన పలు కైంకర్యాలను వీరు సమర్థవంతంగా ఫలవంతం చేశారు. వాటిలో - నిత్యాన్నదానపథకం, విద్యాసంస్థల స్థాపన, విద్వత్ సదస్సుల నిర్వహణ, పలుచోట్ల పరకాలమఠాల పునర్నిర్మాణం, బొంబాయి, హైదరాబాద్, చెన్నై, తిరుమల, మొదలచోట్ల నూతనకేంద్రాల ప్రారంభం, మైసూరులో సముదాయభవన నిర్మాణం మొదలైనవి కొన్ని. సత్యకలం వద్ద కోవెలను పుననిర్మించడంలో వీరు కారణభూతులయ్యారు. తిరుమలలో లక్ష్మీహయగ్రీవస్వామి కోవెలను నిర్మింపజేశారు.

భగవద్రామానుజులువలె శ్రీఅభినవవాగీశ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల స్వామివారు కూడా 120 సం॥ల పాటు ఈ లీలావిభూతిలో వేంచేసి ఉండి, అనుగ్రహిస్తూ, తమ ఉపదేశాలతో అందరినీ అనుగ్రహిస్తూ వేంచేసి ఉండాలని మన అందరం ప్రగాఢంగా కోరుతూ, ఆ రీతిలో అనుగ్రహించవలసినదిగా శ్రియు పతిని వేడుదాం.

శ్రీమన్నూతనరంగనాథ యతిరాడాప్తాత్మవిద్యాలయం
శ్రీమన్నూతన లక్ష్మణాచార్యయతిరాట్ సంప్రాప్తమోక్షాశ్రమమ్ ।
శ్రీవాసేంద్రకటాక్షసంతతసుధా లక్ష్యాత్మయోగాంచితం
శ్రీమన్నూతనవాగధీశయమినం భక్త్యా శ్రయామో గురుమ్ ॥



(శ్రీ అభినవరంగనాథ మహాదేశికుల సన్నిధిలో వేదాంతవిద్యలను పొందినవారు, అభినవరామానుజ సంయమీంద్రుల సన్నిధిలో సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించినవారు, అభినవశ్రీనివాస పరకాలయతీంద్రుల కటాక్షంవల్ల వారి సన్నిధిలో భరన్యాసాన్ని చేసినవారైన అభినవవాగీశ బ్రహ్మతంత్రపరకాలస్వామి వారిని భక్తులమైన మేము ఆశ్రయిస్తున్నాము)

**నవ్యవాగీశయోగీంద్రం హయాస్యపదసేవినమ్ ।**
**బ్రహ్మతంత్రస్వతంత్రార్యం భజాము స్వాత్మసంపదమ్ ॥**

(హయగ్రీవుల పాదాలను సేవించేవారు, ఆధ్యాత్మిక సంపదను కలవారైన అభినవ వాగీశబ్రహ్మతంత్ర పరకాల స్వామివారిని భజిస్తున్నాము).

శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః



# అపూర్వస్తోత్రకదంబకం

**( పలువురు పరకాల మఠాధిపతులు అనుగ్రహించిన స్తోత్రాల సంకలనం )**

శ్రీబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామివారు (మొదటిపట్టం) అనుగ్రహించిన

## (1) ఆచార్యావతారఘట్టార్థః

**1.** బ్రహ్మతంత్రస్వతంత్రేణ పరకాలయతీందునా ।
ఆర్యావతారఘట్టార్థః సంగ్రహేణ ప్రకాశ్యతే ॥

ఆచార్యుల అవతారఘట్టంయొక్క అర్థం బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల యతీశ్వరులచేత సంగ్రహంగా వ్యక్తంచేయబడుతున్నది.

**2.** శ్రీమద్వేదాంతసూక్ష్మార్థనిశ్చయాయాచలాత్మనామ్ ।
శ్రీమానాద్యో గురుః పంచరాత్రలక్షగ్రంథానుపాదిశత్ ॥

మొట్టమొదటి ఆచార్యుడైన శ్రియఃపతి స్థిరమైన మనస్సును కలవారు వేదాంతంలోని సూక్ష్మార్థాలను నిశ్చయించడంకోసం పాంచరాత్రాగమానికి చెందిన లక్షకు మించిన గ్రంథాలను ఉపదేశించాడు.

**3.** చతురశ్చతురోగ్రంథాన్ శ్రీశఠారిస్తతో వ్యధాత్ ।
తతః శ్రీనాథయోగీంద్రో గ్రంథ ద్వయముదాహరత్ ॥

చతురులైన నమ్మాళ్వార్లు (తిరువిరుత్తం, తిరువాశిరియం, పెరియ తిరువన్దాది, తిరువాయ్‌మొళిఅనే) నాల్గు దివ్యప్రబంధాలను రచించారు. తరువాత యోగీంద్రులైన శ్రీమన్నాథమునులు రెండు గ్రంథాలను ఉదాహరించారు. (అనుగ్రహించారు)

**4.** పునః శ్రీయామునాచార్యో గ్రంథానష్టానుదాహరత్ ।
శ్రీరామానుజయోగీంద్ర స్తతోగ్రంథాన్ నవ వ్యధాత్ ॥



తరువాత శ్రీయామునాచార్యులవారు ఎనిమిది గ్రంథాలతో నాథమునుల గ్రంథాలను విశదం చేశారు. ఆ పిమ్మట యోగీంద్రులైన శ్రీరామానుజులు తొమ్మిది గ్రంథాలు విరచించారు.

**5.** తత్సిద్ధాంతసముద్ధ్యర్థం తద్విరోధిక్షపాయ చ ।
స్వప్నే శ్రీశప్రేరిత శ్రీరామానుజనిదేశతః ॥

**6.** సంస్కృత ప్రాకృతాగస్త్యభాషా(స్తోత్ర) సుభాషితాన్ ।
వింశత్యధిశతగ్రంథాన్ చక్రే వేదాంతదేశికః ॥

శ్రీవేదాంతదేశికులు కలలో శ్రియఃపతి అయిన భగవానునిచే ప్రేరేపింపబడిన వారై, శ్రీరామానుజుల ఆదేశంతో నూట ఇరవైకి మించిన సంఖ్యలో పలు స్తోత్రాలతో భూషితాలైన (కూడుకొన్న) గ్రంథాలను సంస్కృతప్రాకృత ద్రావిడభాషలలో నమ్మాళ్వార్లు, శ్రీమన్నాథమునులు, శ్రీయామునులు, శ్రీరామానుజుల గ్రంథాల లోని సిద్ధాంతాల సమృద్ధికోసం, ప్రత్యర్థులను నిరసించడంకోసం రచించారు.

**7.** ప్రకృతానుగుణాన్ గ్రంథాన్ సుబహూంశ్చ తదా తదా ।
వితేనే నిగమాంతార్యో యేషాం సంఖ్యా న విద్యతే ॥

శ్రీమద్వేదాంతదేశికులు అపుడుపుడు ఆ యా సందర్భాలకు అనుగుణమైన పలు గ్రంథాలను రచించారు. వాటికి లెక్క లేదు.

**8.** న చైవాద్యగురుప్రోక్తగ్రంథవద్బహువిస్తరాః ।
న చార్వాచీనరచితగ్రంథవల్లఘవోఽపి చ ॥

అవి, ప్రథమగురువైన శ్రీమన్నారాయణునిచే ప్రోక్తాలైన గ్రంథాలవలె చాలా విస్తృతమైనవి కావు; అర్వాచీనులు రచించిన గ్రంథాలవలె సంక్షిప్తాలు కూడా కావు.

**9.** అన్యూనాధికసంపత్తియుక్తా వేదాంతసారదాః ।
ఏకైకస్మిన్నపి గ్రంథేత్వేకప్రకరణేఽపి చ ॥

ఈగ్రంథాలలో ప్రతి ఒక్క గ్రంథం, ప్రతి గ్రంథంలోని ప్రతి ప్రకరణం అన్యూనాతిరిక్తాలు. అంటే - తెలుపవలసిన అన్నిటిని తెలుపుతున్నవిహా అక్కర లేని విషయాలను వేటినీ తెలుపనివి. వేదాంతసారాన్ని తెలుపుతున్నవి.

**10.** స్వరూపోపాయ పరమపురుషార్థప్రకాశకాః ।
గ్రంథాః శ్రీనిగమాంతార్యరచితాః బుధసమ్మతాః ॥

శ్రీవేదాంతదేశికులు రచించిన గ్రంథాలు స్వరూప-ఉపాయ-పురుషార్థాలను తెలుపుతున్నవి, పండితుల సమ్మతిని కల్గినవి.

**11. నిగమాంతగురుప్రోక్తం గ్రంథం కంచిత్ పఠంతి యే ।**
**విమతస్థాన్ సమస్తాంశ్చ తే జయంతి న సంశయః ॥**

శ్రీవేదాంతాచార్యులవారిచే చెప్పబడిన ఒక్క గ్రంథాన్ని అయినా, ఎవరు పఠిస్తారో, వారు ప్రతివాదులను అందఱిని జయిస్తారు. ఇందులో సందేహం లేదు.

**12. అత ఏవ పురా శ్రీమద్రంగనాథేన చ శ్రియా ।**
**సంతుష్ట్యా శాసితం తస్మిన్ ఉత్సవే ఫాల్గునోత్తరే ॥**

**13. వేదాంతాచార్యరచితప్రబంధా స్సారదర్శినః ।**
**పర్యాప్తమావయోః శ్రోత్రోః కిం వా గ్రంథాంతరాయుతైః ॥**

**14. ఇత ఆకల్పమాలీల మనింద్యం మామకం మతమ్ ।**
**అవ్యాహతం భవేదేతదత్ర మే నాస్తి సంశయః ॥**

అందువల్లనే, పూర్వం ఒకానొక ఫాల్గునమాసం ఉత్తరానక్షత్రంనాడు శ్రీరంగనాథుడు తాను లక్ష్మీదేవితో కలసి వేంచేసి ఉండే సమయంలో చాలా సంతోషంతో ఈ విధంగా ఆశాసించాడు. "వేదాంతాచార్యులవారిచే రచింపబడ్డ ప్రబంధాలు వేదాంతసారాన్ని దర్శింపజేసేవి. మన చెవులకు ఇవే చాలు. ఇక అన్యగ్రంథాలు పది వేలతో ఏమి పని? ఈ నా అభిప్రాయం ఇప్పటినుండి కల్పాంతవరకు అక్షతంగా నిలచి ఉంటుంది. ఎవరిచేత నిందించడానికి సాధ్యం కానిది, ప్రశ్నించడానికి సాధ్యం కానిది, ఇతరులచే హానిచేయడానికి వీలు కానిది. ఈవిషయంలో సందేహంలేదు".

**15. తస్మాత్ పశ్చాత్తనగ్రంథో మాస్తు మాస్తు మహీతలే ।**
**మాచాస్మత్ సంనిధౌ తేషా మర్చాసంమానమిత్యపి ॥**

"అందువల్ల ఇకపై భూమిలో అర్వాచీన గ్రంథం అక్కర లేదు. అక్కర లేదు మా సన్నిధిలో వాటికి పూజగాని, గౌరవంగాని అక్కరలేదు కూడా".

**16. ఏతత్ త్రైలోక్యనిర్మాణత్రాణసంహారకారణమ్ ।**
**ఆవయోరపరాభూతం శాసనం శాశ్వతం పరమ్ ॥**

"ఇది మా ఇద్దఱియొక్క త్రిలోకాల సృష్టిస్థితిసంహారాల యొక్క శాశ్వతమైన గొప్ప శాసనం".



**17. ఏవం మయా శ్రియా చైవ సత్యం శప్తాః స్థ సజ్జనాః! ।**
**అన్యథా చరతః పుంసః క్షిపామ్యేవాచిరాదితి ॥**

"ఓ సజ్జనులారా! మీకు నేను, లక్ష్మీదేవి నిజంగా ఈ విధంగా ప్రమాణాన్ని చేస్తున్నాము నా ఈ శాసనానికి విరుద్ధంగా నడచిన మానవులను కిందకు తోసి వేస్తాను".

**18. రమ్యజామాతృయోగీంద్రః తత్పరీక్ష్య చ శాసనమ్ ।**
**మాస్త్వేవ మామకార్చాదీత్యన్వశాత్ స్వపదాశ్రితాన్ ॥**

రమ్యజామాతృయోగీంద్రులు ఆ శాసనాన్ని గమనించి, "నన్ను అర్చించడం మొదలైనవి వద్దు" అని తమ పాదాలను ఆశ్రయించినవారిని శాసించారు.

**19. యథార్థానేవమాద్యర్థాన్ దర్శయంతీ స్ఫుటం తతః ।**
**సద్భిరేషా పరిగ్రాహ్యా సంప్రదాయప్రకాశికా ॥**

ఇటువంటి యథార్థాలైన విషయాలను స్పష్టంగా దర్శింపజేసే ఈ సంప్రదాయప్రకాశిక సత్పురుషులచే పరిగ్రహించదగినది.

## తనియన్

**పరకాలమునేః ప్రణతిం కలయే చిరకాలకృతైః సుకృతైరమితైః ।**
**నరకాపనయో యదధీనతరో నరకారిరయం యదుపాంతచరః ॥**

చిరకాలం చేసిన, అంతు లేని సుకృతాలచేత నరకాన్ని తొలగించడం ఎవరికి సులభంగా అధీనంలో ఉన్నదో, నరకాసురుని వధించిన ఈ శ్రీకృష్ణుడు ఎవరి సమీపంలో సంచరిస్తున్నాడో, ఆ పరకాలమునికి నమస్కారం చేస్తున్నాను.

శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలమహాదేశిక విరచితమైన

# (2) వేదాంత దేశికమంగళాశాసనమ్

**1. అవతారపరాకాష్ఠా మకారార్థస్యరక్షణే ।**
**దేశికేంద్రాభిధాం వందే దేవతాం తాం దయామయీమ్ ॥**

మకారంచేత తెలుపబడే జీవులయొక్క రక్షణలో గొప్పదైన అవతారం, దయ మూర్తీ మూర్తీభవించిన రూపం, దేశికులనే పేరును కల్గినది అయిన ఆ దేవతను నమస్కరిస్తున్నాను.

2. శ్రీశాద్భుతగుణశ్రేష్ఠదయాయాథాత్మ్యసంపదే ।
మాదృశోజ్జీవనైకార్థదేశికాయాస్తు మంగళమ్ ॥

శ్రియఃపతియొక్క అద్భుతమైన గుణాలలో శ్రేష్ఠమైన దయాగుణంయొక్క యథార్థమైన సంపద (మూర్తీభవించిన శ్రీమన్నారాయణుని దయయొక్క రూపం), మావంటి వారికి ఉజ్జీవింపజేయడమే తన (అవతార) ప్రయోజనంగా కలవారు అయిన వేదాంతదేశికులకు మంగళం.

3. విధేయహయశీర్షాయ స్వనియామ్యగరుత్మతే ।
స్వభవ్యోభయవేదాంత దేశికాయాస్తు మంగళమ్ ॥

హయగ్రీవుని విధేయునిగా (తన అధీనంలో) కలవారు, తనకు నియామ్యునిగా (నియమింపబడదగినవానినిగా) గరుత్మంతుని కలవారు, భవ్యులు అయిన వేదాంతదేశికులకు మంగళం.

4. స్వాధీనవాగ్విలాసాయ సంస్కృతద్రమిడాదిషు ।
అసంఖ్యగ్రంథసంధాత్రే దేశికాయాస్తు మంగళమ్ ॥

సంస్కృతద్రావిడాది భాషలలో తమ అధీనంలో ఉండే వాగ్వైభవాన్ని కలవారు, (సంస్కృతద్రావిడాదిభాషలలో గొప్ప వాగ్వైభవాన్ని కలవారు), పలు గ్రంథాలను రచించినవారైన వేదాంతదేశికులకు మంగళం కలగాలి.

5. ద్రమిడశ్రుతిభిర్లబ్ధైః దశకైః శతకైర్గుణైః ।
లబ్ధైకగుణకశ్రీశ ఘంటాంశాయాస్తు మంగళమ్ ॥

ద్రావిడ వేదమైన తిరువాయ్మొழி ప్రబంధంలోని దశకాత్మకాలైన శతకాల చేత శ్రియఃపతికల్యాణ గుణాలు ప్రతిపాదింపబడ్డాయి. వాటిలో అద్వితీయ కల్యాణగుణం అయిన వాత్సల్యగుణాన్ని కల శ్రియఃపతి (వేంకటేశ్వరుని) ఘంట యొక్క అంశతో అవతరించిన శ్రీదేశికులకు మంగళం కలగాలి.

6. స్వాపదేశాభిధాభేద ప్రకాశనపటీయసే ।
శఠజిద్దివ్యసూక్తీనాం దేశికాయాస్తు మంగళమ్ ॥

నమ్మాழ்వార్ల దివ్యసూక్తులలోని స్వాపదేశార్థాలను, వాచ్యార్థాలను ప్రకాశింప జేయడంలో సమర్థులైన శ్రీదేశికులకు మంగళం కలగాలి.



7. కుదృష్టిమస్తకన్యస్త స్వదక్షిణపదోఽస్మ్యహమ్ ।
ఇతి విఖ్యాతబిరుదేశికాయాస్తు మంగళమ్ ॥

"కుదృష్టుల తలలపై నా ఎడమ పాదాన్ని పెట్టాను'' అని పల్కినవారుగా పేరు పడిన బిరుదాన్ని కల శ్రీదేశికులకు మంగళం.

8. రహస్యత్రయసారేణ సారాసారవివేచనాత్ ।
లోకోజ్జీవనకర్త్రేఽస్మద్దేశికాయాస్తు మంగళమ్ ॥

రహస్యత్రయసారమనే గ్రంథాన్ని రచించడంద్వారా సారాసారవివేచనను చేసి, లోకోపకారాన్ని చేసిన మన దేశికులకు మంగళం కలగాలి.

9. న్యాసవిద్యాసముద్ధార సంస్థాపనవివర్ధనైః ।
ఆకించనముముక్షూణా మాచార్యాయాస్తు మంగళమ్ ॥

న్యాసవిద్య అనబడే శరణాగతికి విద్యను ఉద్ధరించి, సంస్థాపించి, వృద్ధి చేయడంద్వారా అకించనులైన ముముక్షువులకు ఆచార్యులైన శ్రీదేశికులకు మంగళం కలగాలి.

10. దృగ్భిర్ముహుర్దయార్ద్రాభిః విమలాభిశ్చ సూక్తిభిః ।
దేశికాయాత్మన స్సాక్షాన్మంగళం మంగళాత్మనే ॥

మాటి మాటికి దయతో చల్లని చూపులతో, నిర్మలమైన సూక్తులతోను మంగళస్వరూపులైన, సాక్షాత్తు మనకు ఆచార్యులైన శ్రీదేశికులకు మంగళం కలగాలి.

11. పరాకాష్ఠావతారాయ లక్ష్మణే శ్రీపతేః శ్రియః ।
అకారార్థాయ వేదాంతదేశికాయాస్తు మంగళమ్ ॥

గొప్ప అవతార స్వరూపులు, శ్రియఃపతి సంపదయొక్క చిహ్నం, అకారార్థ స్వరూపులు (రక్షకులు) అయిన వేదాంత దేశికులకు మంగళం కలగాలి.

12. దేశికశ్రీపదద్వంద్వ సంప్రదాయసుధాప్రియైః ।
ప్రార్థితం మంగళమిదం పరకాలగురోః శ్శుభమ్॥

వేదాంత దేశికుల శ్రీచరణ యుగ్మానికి చెందిన సంప్రదాయమనే అమృతాన్ని ప్రియంగా కలవారిచే (అభిమానించేవారిచే) ప్రార్థింపబడిన ఈ మంగళాశాసనం శ్రీపరకాలయతీంద్రులకు శుభం అగుగాక!

శ్రీరంగనాథ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల స్వామివారు (30వ పట్టం) అనుగ్రహించిన

## (3) హయగ్రీవమంగళమ్

1. మంగళం శ్రీహయాస్యాయ వేదాహరణకర్మణే ।
ప్రణవోద్గీతవపుషే హయగ్రీవాయ మంగళమ్ ॥

వేదాలను తిరిగి తీసికొనివచ్చిన లక్ష్మీహయగ్రీవునకు మంగళం. ప్రణవం చేత కీర్తింపబడిన మేనిని కల హయగ్రీవునకు మంగళం.

2. చతుఃషష్టికలాధీశ ! విష్వగ్రూప ! హయానన !
మహార్ణవాంబుపర్యంక ! విష్ణవే తేఽస్తు మంగళమ్ ॥

అరవై నాల్గు కళలకు స్వామీ! సమస్తప్రపంచస్వరూపా ! హయగ్రీవా ! మహాసముద్రాన్ని పడుకగా కలవాడా! విష్ణుదేవా ! నీకు మంగళం.

3. అనిరుద్ధాయ సౌమ్యాయ వేదభర్త్రే సనాతన !
శ్రీదాయ శ్రీమయాయాస్తు మంగళం స్వామినే తవ ॥

ఓ సనాతనా ! అనిరుద్ధస్వరూపుడవు, సౌమ్యుడవు, వేదాలను భరించినవాడవు సంపదను అనుగ్రహించేవాడవు, సంపత్స్వరూపుడవు, స్వామివి అయిన నీకు మంగళం కలగాలి.

4. భద్రశ్రీవత్సహారాఢ్య ! పంచరాత్రప్రవర్తక !
భక్తాత్మభావభవన ! మంగళం తేఽస్తు ముక్తిద ॥

మంగళకరమైన శ్రీవత్సంతో, హారాలతో ఆఢ్యమైనవాడా ! పంచరాత్రాగమాన్ని ప్రవర్తింపజేసినవాడా ! భక్తులయొక్క భావనలకు ఆశ్రయభూతుడా! ముక్తిని ఇచ్చేవాడా! (హయగ్రీవా!) నీకు మంగళం కలగాలి. ("భద్ర" - అనేపదాన్ని ప్రత్యేక సంబోధనగా గ్రహించి, మంగళస్వరూపా!- అనే అర్థాన్ని చెప్పవచ్చు.)

5. సర్వకర్మసమారాధ్య ! పూర్ణాషాడ్గుణ్యవిగ్రహ !
శ్రియా గాఢోపగూఢాత్మన్ ! మంగళం తే హయానన! ॥

సమస్తకర్మలచే ఆరాధింపదగినవాడా! పూర్ణమైన షాడ్గుణ్యం మూర్తీభవించినవాడా! లక్ష్మిచే గాఢంగా ఆలింగనం చేసికోబడినవాడా! హయాననా! నీకు మంగళం కలగాలి.



6. అంకేనోద్రూహ్య వాగ్దేవీ మాచార్యకముపాశ్రిత ।
మంగళం తేఽస్తు వాగీశ ! శ్రీనిధే ! శ్రీనికేతన ॥

వాగ్దేవిని ఒడిలో పెట్టుకొని ఆచార్యుల (వేదాంత దేశికుల) దరికి చేరినవాడా! లక్ష్మికి నిధియైనవాడా! సంపదలకు నిలయమైనవాడా! హయగ్రీవా! నీకు మంగళం కలగాలి.

7. స్వరాజే చ విరాజే చ సమాజే తే హయానన ।
వేదకర్త్రే వేదభర్త్రే వేదహర్త్రేఽస్తు మంగళమ్ ॥

గొప్పగా ప్రకాశించేవాడవు, సామ్రాట్టువు, వేదాల కర్తవు (మూలమైనవాడవు), వేదాలను భరించినవాడవు, వేదాలను రక్షించినవాడవు అయిన ఓ హయగ్రీవా! నీకు మంగళం కలగాలి.

8. క్షమాసారాయ హరయే దయాఘన ! హయానన ।
వేదవేదాంతవేద్యాయ సర్వదా తవ మంగళమ్ ॥

దయాగుణానికి మేఘవంటివాడా! హయగ్రీవా! క్షమాగుణానికి సారభూతుడవు, అన్ని పాపాలను హరించేవాడవు, వేదవేదాంతాలచే తెలియబడేవాడవైన నీకు ఎల్లప్పుడు మంగళం.

9. శ్రీరంగనాథేన భక్తేన హయగ్రీవస్య మంగళమ్ ।
రచితం ప్రీతయే తస్య భూయాత్ సర్వత్ర మంగళమ్ ॥

భక్తుడైన రంగనాథునిచేత హయగ్రీవమంగళం ఆ స్వామిప్రీతికోసం రచింపబడింది. దీనివల్ల అందటికి అంతట మంగళం కలగాలి.

---

శ్రీకృష్ణబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలస్వామివారు (31వ పట్టం) అనుగ్రహించిన

## (4) శ్రీహయగ్రీవ పంచరత్నమ్

1. జ్ఞానానందామలాత్మా కలికలుష మహాతూలవాతూలనామా
సీమాతీతాత్మభూమా మమ హయవదనా దేవతా ధావితారిః ।
యాతా శ్వేతాబ్జమధ్యం ప్రవిమలకమలస్రగ్ధరా దుగ్ధరాశిః
స్మేరా సా రాజరాజప్రభృతినుతిపదం సంపదం సంవిధత్తామ్ ॥

జ్ఞానానందమయుడు, కలికాలుష్యమనే గొప్ప దూదిసమూహాన్ని ఎగురగొట్టే పెనుగాలి, అవధిని లేని వైభవాన్ని కలవాడు, శత్రువులను తరిమికొట్టేవాడు, తెల్లని పద్మం మధ్యలో ఉన్నవాడు, స్వచ్ఛమైన తామరపూల మాలను ధరించినవాడు, పాలసముద్రంవంటి చిఱునవ్వుతో కూడినవాడు, కుబేరుడు (చక్రవర్తులు) మొదలైనవారి స్తుతులకు స్థానమైనవాడైన హయగ్రీవుడనే దైవం నాకు సంపదలను కల్గించాలి.

2. **తారాతారాధినాథ స్ఫటికమణిసుధాహీర హారాభిరామా**
**రామారత్నాబ్ధికన్యా కుచలికుచ పరీరంభసురంభధన్యా ।**
**మాన్యాఽనన్యార్హదాస్యప్రణతతతి పరిత్రాణసత్రాత్తదీక్షా**
**దక్షా సాక్షాత్కృతైషా సపది హయముఖో దేవతా సాఽవతాన్నః ॥**

తెల్లని ముత్యాలు, చంద్రుడు, స్ఫటికమణి, అమృతం, మంచు - అనే వీటి వలె మనోహరాలైన హారాలతో అందమైనది, ఎల్లప్పుడు యౌవనంలో ఉన్నది, సముద్రకన్యక అయిన లక్ష్మియొక్క కుచకుంభపరిరంభణాల సంరంభంచేత ధన్యమైనది (లక్ష్మీసంబంధంచేత గొప్పది), మాన్యమైనది, అనన్యార్హమైన దాస్యాన్ని కల్గిన భక్తసమూహాన్ని రక్షించడమనే వ్రతాన్ని నిర్వహించడంలో సమర్థమైనది, నాముందు ప్రత్యక్షమైనది అయిన హయగ్రీవ రూపదేవత మనలను రక్షించుగాక!

3. **అంతర్ధ్వాంతస్య కల్యం నిగమహృదసురధ్వంసనైకాంతకల్యం**
**కల్యాణానాం గుణానాం జలనిధిమభినమద్బాంధవం సైంధవాఖ్యమ్ ।**
**శుభ్రం విభ్రాజమానం దధత మరిదరౌ పుస్తకం హస్తకంజైః**
**భద్రాం వ్యాఖ్యానముద్రామపి హృది శరణం యామ్యుదారం సదారమ్॥**

ఆంతరమైన (మనస్సులోని) చీకటికి (అజ్ఞానానికి) ప్రభాతం వంటివాడు, వేదాలను అపహరించిన అసురులను ధ్వంసం చేయడంలో అద్వితీయుడు, సమస్త కల్యాణగుణాలకు సముద్రుడు, కొలిచేవారికి బంధువు, స్వచ్ఛమైన కిరణాలతో వెలిగేవాడు, శ్రీహస్తాలలో శంఖచక్రాలను, పుస్తకాన్ని, మంగళకరమైన వ్యాఖ్యాన ముద్రను ధరించినవాడు, లక్ష్మీదేవితో కూడినవాడు, మహానుభావుడైన హయగ్రీవుని నా హృదయంలో శరణు పొందుతున్నాను.

4. **వందే తం దేవమాద్యం నమదమరమహారత్నకోటీరకోటీ -**
**వాటీనిర్యత్ననిర్యద్ఘృణిగణ మసృణీ భూతపాదాంశుజాతమ్ ।**



**శ్రీమద్రామానుజార్య శ్రుతిశిఖరగురు బ్రహ్మతంత్రస్వతంత్రైః**
**పూజ్యం ప్రాజ్యం సభాజ్యం కలిరిపుగురుభిః శశ్వదశ్వోత్తమాంగమ్ ॥**

కిరీటాలు ధరించిన దేవతలు తమ శిరస్సులతో హయగ్రీవస్వామి పాదాలకు నమస్కరిస్తారు. ఆ దేవతలు తమ శిరస్సులపై ధరించిన కిరీటాలలో గొప్ప గొప్ప రత్నాలు పొదగబడి ఉన్నాయి. ఆ కిరీటాల అగ్రభాగాల వరుసలనుండి అప్రయత్నంగా వెలువడే కాంతికిరణాల సమూహంతో హయగ్రీవస్వామి శ్రీచరణాలు ఎఱ్ఱగా అయినవి. అటువంటి శ్రీపాదాలు కాంతికిరణాల పుంజాలను కల్గి ఉన్నవి. అటువంటి ఆదిదేవుడైన హయగ్రీవస్వామి, శ్రీరామానుజాచార్యులవారు, వేదాంత దేశికులు, బ్రహ్మతంత్ర స్వతంత్రపరకాలజీయర్ మొదలైన గురువులకు పూజనీయుడు. మహనీయుడైన ఆ హయగ్రీవుని సదా నమస్కరిస్తున్నాను.

5. **విద్యా హృద్యాఽనవద్యా యదనఘకరుణాసార సారప్రసారాత్**
**ధీరా ధారా ధరాయామజని జనిమతాం తాపనిర్వాయిత్రీ ।**
**శ్రీకృష్ణబ్రహ్మతంత్రాదిమ పదకలిజిత్ సంయమీంద్రార్చితం తత్**
**శ్రీమద్ధామాతిభూమ ప్రథయతు కుశలం శ్రీహయగ్రీవనామ ॥**

ఏ హయగ్రీవుని పవిత్రమైన కరుణాప్రవాహసారప్రసారంవల్ల మనోహరమైన, దోషరహితమైన విద్య కల్గుతున్నది. ధీమంతులకు ఆధారమైనది ఆ విద్య. ఈ భూమిలోని జీవుల తాపాన్ని అది తీరుస్తున్నది. శ్రీకృష్ణబ్రహ్మతంత్ర స్వతంత్ర స్థానాన్ని అలంకరించిన జీయర్ స్వామివారిచే అర్చింపబడిన, మనోహరమైన, ఆ లక్ష్మీహయగ్రీవుడనే గొప్ప తేజస్సు మంచిని (అందరికీ) కల్గించాలి.

---

శ్రీకృష్ణబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామివారు (31వ పట్టం) అనుగ్రహించిన

## (5) శ్రీలక్ష్మీపంచరత్నమ్

1. **సరసిజవనీలీలాలోలాముదార ముదావహాం సరస -**
**కరుణాసాంద్రాం చంద్రాననాం భువనావనామ్ ।**
**ఫణిధరణిభృచ్ఛృంగాసంగాచ్యుతోరసి భాసురాం**
**మనసి భవతీం మాతః! ప్రాతః స్మరామి పరాత్పరామ్ ॥**

ఓ తల్లీ! పద్మాల వనంలో విహరించడంలో ఆసక్తిని కల్గినదానవు, గొప్ప ఆనందాన్ని కల్గినదానవు, సరసమైన దయతో నిండినదానవు, చంద్రునివంటి

ముఖాన్ని కల్గిన దానవు, లోకాలను సంరక్షించేదానవు, శేషశైలశిఖరనివాస రసికుడైన వేంకటేశ్వరుని వక్షఃస్థలంలో ప్రకాశిస్తున్నదానవు, పరాత్పరవు, పూజ్యురాలవు అయిన నిన్ను ప్రాతఃకాలంలో మనస్సులో ధ్యానిస్తున్నాను.

ఇక్కడ సరసిజవనీశబ్దంచేత భగవానుడు లక్షింపబడుతున్నాడనికూడా చెప్పవచ్చునని కొందఱి వివరణం. "కణ్ణినైయు మరవిన్ద మడియు మ.·.తే" అని, "తిరుమాణిక్కమలైమేల్ మణిత్తడన్దామరై క్కాడుకళ్‌పోల్ తిరుమార్బు వాయ్ కణ్‌కై ఉన్ది కాల్ ఉడైయాడైకళ్ శెయ్యపిరాన్" అని ఆళ్వార్లు పల్కిన రీతిలో సరసిజవనం స్వామియే అనడం సరసం కదా!

2. త్రియుగహృదయ దాసీభావశిక్షైకదీక్షైః
త్రిజగదభయదానస్థూలలక్షైః కటాక్షైః ।
శమితవినతతాపాం ప్రాతరుద్ధూతపాపామ్
అమితసుగుణజాలాం చింతయేఽమ్భోధిబాలామ్ ॥

"త్రియుగ" మనబడే అరిషడ్వర్గాన్ని కలవారి హృదయాలలో దాసీభావాన్ని కల్గించడమనే అద్వితీయమైన దీక్షను కల్గినవి, ముల్లోకాలకు అభయాన్ని ఇవ్వడంలో సమర్థమైనవి అయిన కటాక్షాలతో తనను ఆశ్రయించినవారి తాపాలను తీర్చేది, పాపాలను లేకుండా ఎగురగొట్టేది, అంతులేని సుగుణాల సమూహాన్ని కల్గినది, క్షీరాబ్ధిబాలిక అయిన లక్ష్మీదేవిని ప్రాతఃకాలంలో ధ్యానిస్తున్నాను.

3. విధిశిశుకనిటాలాం విశ్వరక్షైకలీలాం
కనకరుచిరవేలాం క్షాంతిపాథోధివేలామ్ ।
ఉషసి జలధిబాలా ముల్లసత్పద్మమాలాం
స్మర హృదయ! సుశీలాం స్మేరపద్మాత్తలీలామ్ ॥

చంద్రునివలె అందమైన, చిన్నదైన ఫాలభాగాన్ని కల్గినది, సమస్తజగత్తును రక్షించడమనే అద్వితీయమైన లీలను కల్గినది, గొప్ప బంగారు వన్నెను కల్గినది, క్షమాగుణసముద్రానికి అవధి, వికసించే తామరపూల మాలను కల్గినది, గొప్ప శీలగుణాన్ని కల్గినది, వికసించే పద్మాలను విలాసంగా ధరించినది అయిన లక్ష్మీదేవిని ఓ హృదయమా! ప్రాతఃకాలంలో స్మరించు.

4. అఖిలభువనమాన్యా మబ్ధిరాజస్య కన్యాం
హృది భగవదనన్యాం కల్పవల్లీ మివాన్యామ్ ।



విరతిజుషి రజన్యాం చింతయంతో వదాన్యాం
మనుజజనిమవన్యాం మాచరామోఽతిధన్యామ్ ॥

సమస్తలోకానికి మాన్య, సముద్రరాజుకుమార్తె, భగవానునికంటే అనన్య, వేఱొక కల్పవల్లివంటిది, ఉదారస్వభావాన్ని కల్గినది, మానవజన్మను కల్గినవారిని రక్షించేది, (భగవానునితో గల నిత్యసంబంధంచేత) గొప్ప ధన్య అయినది అయిన లక్ష్మీదేవిని హృదయంలో అనుసరిస్తున్నాము (ధ్యానిస్తున్నాము).

5. హరౌ రక్తాం ముక్తారుచిరరదనాం చంద్రవదనాం
సదా భక్తాసక్తాం శమితకదనా మబ్జసదనామ్ ।
పయోజాతవ్రాతస్ఫురణ హరణానర్ఘచరణాం
శ్రియం ప్రాతర్యమితకరణం యామి శరణమ్ ॥

హరి విషయంలో అనురాగాన్ని కల్గినది, ముత్యాలవంటి అందమైన దంతాలను కల్గినది, చంద్రునివంటి ముఖాన్ని కల్గినది, ఎల్లప్పుడు భక్తులపట్ల ప్రేమను కల్గినది, యుద్ధాన్ని నివారించేది, పద్మాన్ని నివాసంగా కల్గినది, పద్మాల సమూహంయొక్క కాంతిని హరించే గొప్ప చరణాలను కల్గినది అయిన లక్ష్మీదేవిని ఇంద్రియనిగ్రహాన్ని కలవాడనై శరణు పొందుతున్నాను.

6. ఇత్థం పంచశ్లోక్యా శ్రీకృష్ణబ్రహ్మతంత్రయతివినుతామ్ ।
కమలాం ప్రాతః ప్రాతః కలయంతః ప్రాప్నుయుః శ్రియం విపులామ్ ॥

ఈ రీతిలో అయిదు శ్లోకాలతో శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాలయతీంద్రులచే రచింపబడిన లక్ష్మీస్తుతిని ప్రతిదినం ప్రాతఃకాలంలో అనుసంధించేవారు విపులమైన సంపదను పొందగలరు.

---

శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాల స్వామివారు (31వ పట్టం) అనుగ్రహించిన

## (6) ప్రపన్నామృతస్తోత్రమ్ (శ్రీకృష్ణస్తుతి)

1. కలయతు కల్యాణగుణం కమలాకుచకుంకుమాంకితోరస్కమ్ ।
యదువంశమౌక్తికం తత్కిమపి మహః సర్వదాఽపి మమ హృదయమ్॥

కల్యాణగుణాలను కల్గినది, లక్ష్మీకుచకుంకుమంచేత అంకితమైన వక్షఃస్థలాన్ని కల్గినది, యదువంశంలో జన్మించిన ముత్యంవంటిది అయిన అనిర్వచనీయ తేజః స్వరూపాన్ని (శ్రీకృష్ణుని) ఎల్లప్పుడు నా హృదయం ధ్యానించాలి.

2. వందే తం దేవసుతం వసుదేవవధూస్తనంధయం కమపి ।
వరదం వరేణ్యశీలం వల్లవభవనాత్తలీలమిహ బాలమ్ ॥

వసుదేవుని కుమారుడు, యశోదకు చంటిపిల్లవాడు, అనిర్వచనీయుడు, వరాలను ఇచ్చేవాడు, గొప్ప శీలగుణాన్ని కలవాడు, గొల్లల ఇండ్లలో లీలలను చేసేవాడు అయిన ఆ బాలుని నమస్కరిస్తున్నాను.

3. వ్రజరచితకేళిసుదతీ వ్రజహృదయానందకందళం కిమపి ।
వ్రజ హృదయ! దివ్యతేజోవృజిన తమోమూలభేదనపటిష్ఠమ్ ॥

రేపల్లెలో చేసిన లీలలద్వారా అందమైన గొల్ల జయువతుల హృదయాలలో ఆనందాన్ని అంకురింపజేసేది, పాపాలనే చీకటియొక్క మూలాన్ని ఛేదించడంలో పటిష్ఠమైనది, అనిర్వచనీయమైనది అయిన దివ్యతేజస్సును (శ్రీకృష్ణుని), ఓ హృదయమా! ఆశ్రయించు.

4. లీలాముదితయశోదం లలితప్రస్నిగ్ధముగ్ధతరవాదమ్ ।
ఆకుంచితైకపాదం భజ తేజః కిమపి విరచితాహ్లాదమ్ ॥

తన లీలలతో యశోదను ఆనందపఱచినది, చాలా అందమైన, ముద్దు ముద్దు అమాయకపు మాటలను పల్కుతున్నది, కొంచెం ముడిచిన పాదాన్ని కల్గినది, ఆనందాన్ని కల్గించేది అయిన అనిర్వచనీయ తేజస్సును (ఓమనసా!) ఆశ్రయించు.

5. హృదయ ! నవనీచోరం పారదతరళాంఘ్రికమలసంచారమ్ ।
పరిలులిత గోపదారం గృహాణ యత్నేన కమపి సుకుమారమ్ ॥

ఓ హృదయమా ! పాదరసంవలె మెఱిసే పాదపద్మాలతో సంచరించేవాడు, నవనీతచోరుడు, గోపాలకుల పత్నుల హృదయాలను మిక్కిలి తడబడేట్లు చేసినవాడు, అనిర్వచనీయుడైన సుకుమారుని (శ్రీకృష్ణుని) ప్రయత్నపూర్వకంగా ఆశ్రయించు.

6. గోపవధూభోగార్హం శేఖరితానర్ఘబర్హివరబర్హమ్ ।
ఘనవిభవపారిబర్హం కలయే హృదయే చిరాయ దాశార్హమ్ ॥

గోపకన్యకల భోగానికి (ఆనందానికి) అర్హమైనవాడు, గొప్పదైన నెమలి పింఛాన్ని శిరస్సుపై అలంకరించుకొన్నవాడు. ఘనమైన వైభవాన్ని సూచించే చిహ్నా లను కలవాడు, దాశార్హుడైన శ్రీకృష్ణుని హృదయంలో చిరకాలం ధ్యానిస్తున్నాను.



7. గోఖురవిదారితావనిధూళీ ధూసరితకుంతల ముదారమ్ ।
సంచింతయేఽంతరంగే సుకుమారం కమపి వల్లవకుమారమ్ ॥

గోవుల గిట్టలచేత బ్రద్దలు చేయబడ్డ భూమినుండి పైకి లేచిన దుమ్ముతో కూడుకొన్న కేశపాశాన్ని కలవాడు, గొప్పవాడు, సుకుమారుడు అనిర్వచనీయుడైన గోపబాలుని నా మనస్సులో ధ్యానిస్తున్నాను.

8. కమపి ఘనాఘననీలం గోపవధూటీకుచగ్రహవిలోలమ్ ।
కలయామి గోపబాలం లోలాలకజాల మధురకరితఫాలమ్ ॥

వర్షాకాలమేఘంవలె నల్లనివాడు, గోపవనితలను ఆలింగనం చేసికోవడంలో మిక్కిలి ఆసక్తిని కలవాడు, తుమ్మెదలవంటి చలించే ముంగురుల సమూహంతో కూడుకొన్న ఫాలభాగాన్ని కలవాడు, అనిర్వచనీయుడైన గోపబాలుని ధ్యానిస్తున్నాను.

9. కుందవినిందనరదనాన్ మందితపూర్ణేందుబింబ రుచివదనాన్ ।
మునిహృదయకేళిసదనాన్ వ్రజవిభవాన్ తాన్ భజే విధుతమదనాన్ ॥

అందంలో సన్నజాజిమొగ్గలను జయించిన దంతాలను కల్గిన, పూర్ణచంద్రుని శోభను మించిన వదనాన్ని కల్గిన, మునిహృదయాలను తన లీలాగృహాలుగా కల్గిన, మన్మథుని జయించిన ఆ రేపల్లెలోని సంపదలను (శ్రీకృష్ణుని) భజిస్తున్నాను.

10. నందానందనచందన! ముచుకుందానందకంద! గోవింద! ।
మమ వింద హృదరవిందం మిళిందసుందర! ముకుంద! నను మందమ్॥

ఓ ముకుందా! నందుని హృదయానికి చందనంవలె చల్లనివాడా! (ఆనందింపజేసేవాడా) ముచుకుందుని ఆనందాన్ని మూలమైనవాడా! గోవిందా! తుమ్మెదవలె సుందరుడా ! నా హృదయారవిందాన్ని మెల్లగా ప్రవేశించాలి.

11. కిమపి యశోదాభాగ్యం వ్రజలలనాపృథులకుచయుగీభోగ్యమ్ ।
రక్షామి నీలరత్నం రమణీయం హృదయసంపుటే నూత్నమ్ ॥

యశోదాదేవి భాగ్యం, రేపల్లెలోని యువతుల కుచయుగాన్ని (హృదయ సీమకు) భోగ్యం, అందమైన నీలరత్నంవలె ఉన్న వానిని నా హృదయపేటికలో నూతనమైన అందమైన నీలరత్నంవలె కాపాడుకుంటాను.

12. మురళీనినాదరసభర తరళీకృతతర్ణకవ్రజో భజతామ్ ।
కోఽపి ఘనాఘనశాబః కోమలరూపోఽద్య ధర గహనం మే ॥

మురళీగానరసంతో నిండినవై, ఆ ఆనందంతో (లతలు) ఊగే రీతిలో రేపల్లె లోని లేగదూడలను చేసినవాడు, ఆరాధించేవారికి అద్వితీయమైన వర్షాకాల మేఘపు తునుకవలె అందంగా ఉన్నవాడు, మనోహరరూపుడు -

**13. కాళిందీపులినాంతర కలితవిహారం మనోజ్ఞమణిహారమ్ ।**
**తేజః కిమపి నిలీనం జాగర్తు మదీయహృది రుచిరలీలమ్ ॥**

యమునానదీతీరంలోని ఇసుక తిన్నెలలో విహరించినది, అందమైన మణి హారాలను కల్గినది, భోగ్యాలైన లీలలను కల్గినది, అనిర్వచనీయమైనది తేజస్సు నా హృదయంలోని లీనమై శాశ్వతంగా ప్రకాశించాలి.

**14. కానపి భజే విలాసాన్ కలితవ్రజసుందరీ రుచిరరాసాన్ ।**
**రాధాకటాక్షదాసాన్ రాకాసితకిరణసఖహాసాన్ ॥**

రేపల్లెలోని స్త్రీలతో అందమైన రాసక్రీడను చేసినవి, రాధాదేవి కటాక్షాలకు దాసులైనవి, పున్నమినాటి వెన్నెలకు స్నేహితులైన హాసాలను కల్గినవి, అనిర్వచనీయాలైనవి అయిన శ్రీకృష్ణుని విలాసాలను భజిస్తున్నాను.

**15. అతిముగ్ధం దధి లబ్ధుం సుస్నిగ్ధం కిమపి మమ సిద్ధమ్ ।**
**చారుముఖం తారసఖస్మేరసఖం తచ్చిరాదపారసుఖమ్ ॥**

చిక్కని పెరుగును పొందడంలో చాలా కోరికను కల్గినది, అందమైన ముఖాన్ని కల్గినది, నక్షత్రాలవలె ప్రకాశించే నఖాలను కల్గినది, అపరిమితానంద స్వరూపమైనది, అనిర్వచనీయం అయిన ఒకానొక వస్తువు నాకు చిరకాలానికి లభించింది.

**16. వికటాదిదర్పదుర్మద శకటాసురధుతిధుర్యచరణతలమ్ ।**
**ప్రకటానురాగరుచిరం సుకటాక్షాన్మయి తనోతు తత్తేజః ॥**

వికటస్వభావం, దర్పం, మదం మొదలైనవానిని కల్గిన శకటాసురుని భగ్నం చేయడంలో సమర్థమైన శ్రీపాదతలాన్ని కల్గినది, భక్తులపట్ల వ్యక్తమైన అనురాగాన్ని కల్గినది, గొప్పదైన ఆ తేజస్సు నాపై కటాక్షాలను విస్తరింపజేయాలి.

**17. యమునాకూలవిహారం యమినా మధునాఽపి బహుదూరమ్ ।**
**మహదచ్యుతకైశోరం మమ హృది వితనోతు నిత్యసంచారమ్ ॥**



యమునానదీతీరంలో విహారాన్ని చేసినది, ఇంద్రియనిగ్రహాన్ని కల్గిన యోగులకు ఇప్పటికీ చాలా దూరంలో ఉన్నది, గొప్పది అయిన అచ్యుతుని బాల్యం నా హృదయంలో నిత్యసంచారాన్ని చేయాలి.

**18. బహుతరతరంగఘట్టిక యమునాశుక్త్యుదరగలితమివ నీలమ్ ।**
**ముక్తాఫలం ప్రవిచలత్తత్ర విచిత్రం విభావయే హృదయే ॥**

అనేక తరంగాలచే తాకబడిన యమునానదిలోని ముత్యపు చిప్ప ఉదరం నుండి జారిపడినది, నల్లనిది, అక్కడ సంచరించేది, అందువల్లనే విచిత్రమైనది అయిన ముక్తాఫలాన్ని (శ్రీకృష్ణుని) నేను హృదయంలో భావిస్తాను.

(యమునా నదీజలం నల్లగా ఉంటుంది కనుక, ఆ నీటికాంతి సోకి ముత్యం నల్లగా భాసిస్తున్నదని భావం.)

**19. సోమాననగోపీజన కౌమారహరం ప్రవాళలసదధరమ్ ।**
**తరుణం కిమపి మనోహరచరణం శరణం భజే ధృతాభరణమ్ ॥**

చంద్రునివంటి అందమైన ముఖాన్ని కల్గిన గోపికల లేతవయస్సును హరించినవాడు, పగడంవలె ప్రకాశించే అధరాన్ని కలవాడు, వయస్సులో ఉన్నవాడు, అనిర్వచనీయుడు, మనోహరమైన చరణాలను కలవాడు, ఆభరణాలను కలవాడైన శ్రీకృష్ణుని శరణంగా భజిస్తున్నాను.

**20. ఖంజితగోపీహృదయం రంజితభువనం శ్రయామి గోపశిశోః ।**
**సంజీవితగోసంతతిం మంజులమంజీరశింజితం నృత్తమ్ ॥**

గోపికల హృదయాలను భగ్నం చేసినది (మిక్కిలి ఆర్తిని కల్గించినది), జగత్తును ఆనందింపజేసినది, గోవుల సమూహాన్ని సంజీవినివలె ఉజ్జీవింపజేసినది అయిన గోపశిశువు (శ్రీకృష్ణుని) యొక్క మనోహరమైన అందెల సవ్వడితో కూడిన కల నృత్యాన్ని ఆశ్రయిస్తున్నాను.

**21. కాళియఫణమణిమధ్యే నీలతరం నూత్నజాత మివ రత్నమ్ ।**
**తన్మూర్ధన్యస్తపదం చూడాలంకరణ మస్తు ధామ మమ ॥**

కాళియుని పడగలలోని మణుల మధ్యలో మిక్కిలి నల్లగా ఉన్నది, అక్కడ కొత్తగా పుట్టిన రత్నంవలె ఉన్నది అయిన ఆ కాళియుని శిరస్సుపై పెట్టిన (శ్రీకృష్ణుని) పాదం నాకు ప్రకాశించే కేశాలంకారం కావాలి.

**22. సితకరకిరణ త్రస్యద్గోపీరతికేళి రచితతిమిరభరమ్ ।**
**తత్కిమపి ధామ హృదయే నీలతరం న స్తమో నిరాకురుతామ్ ॥**

చంద్రుని కిరణాల కాంతికి భయపడే గోపికల రతికేళికోసం సృష్టింపబడిన చీకటి సమూహంవలె ఉన్నది, అనిర్వచనీయమైనది, మిక్కిలి నల్లనిది అయిన తేజస్సు మన హృదయంలోని చీకటిని పోగొట్టాలి.

**23. నిర్మలతర మతిశిశిరం నిరుపమ మవగాహతాం మనో రుచిరమ్ ।**
**నందకిశోరమనోహర శరీరతేజః కళిందజాపూరమ్ ॥**

మిక్కిలి నిర్మలమైనది, చాలా చల్లనిది, సాటి లేనిది, మనోహరమైనది, నందుని కుమారుడైన శ్రీకృష్ణుని మనోహరమైన శరీరకాంతి అనే యమునానదీ ప్రవాహాన్ని నా మనస్సు అవగాహించాలి.

**24. మహ ఇహ మనసి విలగ్నం మణిమయకాంచీ మనోహరమగ్నమ్ ।**
**గోపీకటాక్షమగ్నం గోప్తుం క్షమమేవ మాం భవ నిమగ్నమ్ ॥**

మణులతో నిండిన మొలనూలుతో అందమైన నడుమును కల్గినది, గోపికల కటాక్షాలలో మునిగినది, సంసారంలో బాగా మునిగి ఉండే నన్ను రక్షించడంలో సమర్థమైనదైన తేజస్సు ఇక్కడ నామనస్సులో బాగా నిలచి ఉన్నది.

**25. విందే పదారవిందే మందేతరవిభవపదే కృతానందే ।**
**నందకులానంద కలాబృంద విలాసస్య కస్యచిద్ధామ్నః ॥**

నందుని కులానికి ఆనందాన్ని కల్గించే కళాసమూహాలను కల్గిన విలాసాన్ని కల్గినది, అనిర్వచనీయమైనది అయిన తేజస్సుయొక్క గొప్ప వైభవాన్ని ఇచ్చేది, ఆనందాన్ని కల్గించేది అయిన పాదారవిందాలను రెండిటిని పొందుతున్నాను.

**26. ఇతి మహీశూరపురోత్తమ నరపతిచామేంద్ర భూపకులగురుణా ।**
**కలితా స్తుతిర్విజయతాం శ్రీకృష్ణబ్రహ్మతంత్రకలిరిపుణా ॥**

మహీశూర (మైసూర్) అనే గొప్ప నగరానికి అధిపతి అయిన చామేంద్ర భూపతికి ఆచార్యులు శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాలయతీశులచే ఈ విధంగా రచింపబడిన స్తుతి వర్ధిల్లాలి.

---



శ్రీకృష్ణబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామివారు (31వ పట్టం) అనుగ్రహించిన

# (7) శ్రీప్రపన్నమకరందస్తోత్రమ్ (శ్రీరామస్తుతి)

**1. కలయతు కుశలాని కాలమేఘద్యుతి మదధూననధీర దివ్యకాంతి ।**
**కిమపి రఘుకులాంబురాశిరత్నం సకలశుభావహనామ తచ్చిరత్నమ్॥**

నల్లని మేఘకాంతియొక్క గర్వాన్ని ఎగురగొట్టడంలో ధీరమైన అప్రాకృత కాంతిని కల్గినది, అనిర్వచనీయమైనది, అన్ని శుభాలను కల్గించే పేరును కల్గినది, రఘువంశమనే సముద్రంలో పుట్టినది అయిన గొప్పరత్నం కుశలాలను కల్గించాలి.

**2. ఘనతరకరుణామృతాంబురాశి ప్రసరదుదారతరంగకై రపాంగైః ।**
**ప్రశమిత వినతాళిచిత్తతాపం కిమపి మహో హృది మేఽస్తు దివ్యరూపమ్॥**

చాలా గొప్పదైన కరుణామృతరసముద్రంనుండి ప్రసరించే గొప్ప తరంగాలనే చూపులతో నమస్కరించేవారి మనస్సులోని తాపాన్ని హరించేది, అనిర్వచనీయమైనది, దివ్యమైన రూపాన్ని కల్గినది అయిన తేజస్సు నా మనస్సులో నిలచి ఉండాలి.

**3. వివిధమణిమరీచిజాల లీలాశబలితహేమకిరీట లోలమాలమ్ ।**
**మృగమదతిలక స్ఫురన్నిటాలం హృదయ! సదా భజ కోసలేంద్రబాలమ్॥**

పలు మణుల కాంతుల విలాసాలతో పలు వర్ణాలను కల్గినవిగా చేయబడిన బంగారు కిరీటంలో కదలాడే మాలికలను కలవాడు, కస్తూరీతిలకంతో ప్రకాశించే ఫాలాన్ని కలవాడైన కోసలేంద్రుని (దశరథుని) బాలకుని (శ్రీరాముని) ఓ హృదయమా! సదా భజించు.

**4. విమలకిరణబాల్యలీల ఫాలప్రతిలులితాలకజాలలాలనీయమ్ ।**
**నవనలినదళామలాయతాక్షం కిమపి వశే కలయాని దీనరక్షమ్ ॥**

స్వచ్ఛమైన కిరణాలను (ప్రకాశాన్ని) కల్గినవాడు, బాల్యలీలలలో నుదుటిపై అటుఇటు కదలాడే ముంగురుల సమూహంతో లాలింపబడేవాడు (అందమైన వాడు), నూతనమైన తామరపూవు రేకువంటి, నిర్మలమైన విశాలమైన నేత్రాలను కలవాడు, దీనులను రక్షించేవాడు, అనిర్వచనీయుడైనవానిని ధ్యానిస్తున్నాను.

**5. సులలితచలితాతివిభ్రమ భ్రూకలనవిలోలిత భూసురాంతరంగే ।**
**ముకురతలలసత్కపోలభావే లసతు చిరం మమ చిత్త మాదిదేవే ॥**

చాలా అందంగా చేయబడిన కదలికలను కల కనుబొమల విలాసాలతో భూసురుల అంతరంగాలను మిక్కిలిగా చలించేటట్లు చేసినవాడు (ప్రభావితం చేసినవాడు), అద్దాలవలె స్వచ్ఛంగా ప్రకాశించే చెక్కిళ్ళను కలవాడైన ఆదిదేవునిలో నా చిత్తం చిరకాలం ప్రకాశించాలి.

6. **మణిగణరుచిరాంగకుండల శ్రీకవచితకర్ణయుగే మనోజ్ఞనాసే ।**
**విహరతు మమ చిత్తవృత్తి రేషా ధరణిసుతావశగే చిరాయ ధామ్ని ॥**

మణుల సమూహాలతో మనోహరాలైన కుండలాల శోభతో వ్యాప్తమైనట్టి రెండు కర్ణాలను (చెవులను) కల్గినది, అందమైన నాసికను కల్గినది, సీతాదేవి వశంలో ప్రవర్తించేది అయిన తేజస్సులో ఈ నా మనోవ్యాపారం విహరించాలి.

7. **రసభరపరిపాకరాజమాన స్ఫుటతరదాడిమబీజ దంతపంక్తిమ్ ।**
**అధరమణిసుధావిధూత సీతాహృదయజతాప ముపాస్మహే పుమాంసమ్॥**

(తాంబూల) రసంతో నిండిన పరిణామంచేత ప్రకాశించే, చాలా స్పష్టంగా దానిమ్మ గింజలవలె ఉండే దంతాల వరుసను కలవాడు, పగడంవలె ఎఱ్ఱగా ఉండే పెదవియొక్క అమృతంద్వారా సీతాదేవి హృదయంలోని తాపాన్ని తీర్చినవాడైన (వరకు) పురుషుని (శ్రీరాముని) ఉపాసిస్తున్నాను.

8. **శరదుదితసుధాకరాంశుశైలీ మదదరశీతలవాచి సుప్రసన్నే ।**
**అరుణకిరణభిన్న పద్మలక్ష్మీవిజయి రామముఖేఽస్తు మానసం మే ॥**

శరత్కాలంలో ఉదయించిన చంద్రుని కిరణాల శైలియొక్క మదాన్ని భగ్నం చేసే చల్లని వాక్కును కలవాడు (చల్లగా మాటలాడేవాడు), చాలా ప్రసన్నంగా ఉండేవాడు, బాలసూర్యుని కిరణాలవల్ల వికసించిన పద్మంయొక్క శోభను జయించే వాడైన శ్రీరాముని ముఖంలో నా మనస్సు లగ్నం కావాలి.

9. **దరదళదరవిందమందమంద ప్రసరదమందమరంద సుందరాంగాః ।**
**వివశతి ధరణీసుతాంతరంగా రఘునృపతేః ప్రసరంతు మయ్యపాంగా॥**

కొంచెం వికసించిన పద్మంనుండి కొంచెం కొంచెంగా జాలువారే మకరందం వలె అందమైనవి, సీతాదేవి అంతరంగాన్ని వివశం చేసినవి అయిన శ్రీరాముని కటాక్షాలు నాపై ప్రసరించాలి.

10. **అమృతరుచిసహోదరస్మితశ్రీజుషి ఘనకంబువిడంబి కంధరేఽస్మిన్।**
**సితకరకిరణాత్యుదారహారే మమ హృదయం భవతాద్విహారి వీరే ॥**



చంద్రునితో పోలిన చిఱునవ్వుయొక్క కాంతిని కల్గినదైన గొప్ప శంఖంవంటి కంఠాన్ని కలవాడు, చంద్రుని కిరణాలకంటే గొప్పవైన (మిక్కిలి చల్లని-ఆహ్లాద కరమైన) హారాలను కలవాడు, వీరుడైన శ్రీరామునిలో నా హృదయం విహరించేదిగా కావాలి.

11. **కరకమలగలన్మరందధారా విశయవదావద దివ్యచాపదండమ్ ।**
**అశిశిరకరవంశజాగ్రగణ్యం విశంతు మనో మమ ధన్వినాం వరేణ్యమ్॥**

హస్తమనే కమలంనుండి స్రవించే మకరంద ధారయా ఇది! అనే సందేహాన్ని వ్యక్తం చేసే రీతిలో ఉండే దివ్యమైన ధనుర్దండాన్ని కలవాడు, సూర్యవంశంలో గొప్పవాడు, గొప్ప విలుకాడైన శ్రీరాముడు మనస్సులో ప్రవేశించాలి.

12. **నిశిచరకులకలితోగ్రదండం మనసి మహో మమ భాసతామఖండమ్ ।**
**అరిసరసిజధూననాతిశౌండ ద్విరదకరాయిత దీర్ఘబాహుదండమ్ ॥**

రాక్షసులను తీవ్రంగా దండించినది, శత్రువులనే పద్మాలను అవలీలగా ధ్వంసం చేయడంలో మిక్కిలి సమర్థమైన, ఏనుగుతొండంవలె ఉండే దీర్ఘమైన బాహుదండాన్ని కల్గినది అయిన తేజస్సు నా మనస్సులో అఖండంగా భాసించాలి.

13. **మరకతహరి నీలపద్మరాగస్ఫురిత మహాంగదకంకణాదిసేవ్యమ్ ।**
**మమ నయనపథోఽస్తు వస్తు దివ్యం శుభహరిచందన చర్చనాతిభవ్యమ్॥**

మరకతమణులు (పచ్చలు), ఇంద్రనీలమణులు, పద్మరాగాలతో ప్రకాశించే గొప్ప అంగదాలు, కంకణాలచే అలంకరింపబడినది, మంగళకరమైన హరిచందనం మైపూతలతో అందమైనది అయిన దివ్యమైన వస్తువు నా కంటికి సాక్షాత్కరించాలి.

14. **నవతరుణిమజానకీమనోజ్ఞస్తనయుగకర్కశతారసజ్ఞవక్షః ।**
**కిమపి సకలలోకభాగధేయం మయి విశతాచ్ఛుభదాయినామధేయమ్॥**

నూతనయౌవనాన్ని కల్గిన జానకిదేవి అందమైన స్తనయుగ్మం యొక్కకాఠిన్య రసాన్ని తెలిసిన వక్షస్సును కల్గినది, శుభాలను కల్గించే నామధేయాలను కల్గినది అనిర్వచనీయమైనది అయిన సకలలోకాల అదృష్టం అయిన శ్రీరాముడు నా (హృదయంలో) లో ప్రవేశించాలి (సాక్షాత్కరించాలి).

15. **నవజలధరబృంద తుందదీవ్యత్తటిదుపమాన సువర్ణచారుచేలమ్ ।**
**త్రివళిసులలితోదారం సుశీలం రఘుకులరత్న ముపాస్మహేఽతినీలమ్॥**

నూతనమేఘసమూహం వంటి నడుములో ప్రకాశించే మెఱపుతీగవంటి బంగారు రంగులోని అందమైన పీతాంబరాన్ని కల్గినది, త్రివళులతో (మూడు మడుపులతో) అందమైనది, గొప్పది, సౌశీల్యగుణాన్ని కల్గినది, మిక్కిలి నీలమైనది అయిన రఘుకులరత్నాన్ని (శ్రీరాముని) ఉపాసిస్తున్నాను.

**16. కమలజజనిగేహనాభిపద్మ స్ఫుటరసలోలుప రోమభృంగరాజి।**
**హృది పరికలయామి కోసలేంద్రక్షితిరమణీ మృగనాభిచిత్రకం తత్॥**

బ్రహ్మకు జన్మస్థానమైన నాభీపద్మంలోని తేనెలో ఆశ కల్గిన భృంగాల (తుమ్మెదల) వంటి రోమసమూహాన్ని కల్గినది, కౌసల్యాదేవిచే (తేజస్సును) కస్తూరిలో వ్రాయబడిన చిత్రాన్ని కల్గినదైన ఆ శ్రీరాముని హృదయంలో ధ్యానిస్తున్నాను.

**17. మృగపతితనుమధ్య మున్నతాంసం సువిపులపీవర దివ్యబాహుమధ్యమ్।**
**విధుకరరుచిరాంతరీయ మీడే కమపి యువాన ముదారచారుమూర్తిమ్॥**

సింహమధ్యముడు, ఉన్నతమైన భుజస్కంధాలను కలవాడు, మిక్కిలి విశాలమైన, దృఢమైన, దివ్యమైన వక్షఃస్థలాన్ని కలవాడు, చంద్రునివంటి తెల్లని అంతరీయాన్ని (క్రింది భాగంలో ధరించే వస్త్రాన్ని కలవాడు, గొప్ప అందమైన రూపాన్ని కలవాడైన అప్రాకృతయువకుని స్తుతిస్తున్నాను).

**18. తరుణిమదనేభయుగ్మ లీలాప్రసృతకరద్వయ సన్నిభోరుయుగ్మమ్।**
**సుమశరజయకాహళాయమాన స్ఫుటతరజంఘ మహం భజామి దేవమ్॥**

వయస్సులో ఉండే రెండు మదపుటేనుగులు విలాసంగా చాచిన రెండు తొండాలవలె ఉండే రెండు ఊరువులను కల్గినవాడు, మన్మథుని జయాన్ని ప్రకటించే బాకా (కాహళి) వలె తోచే, వ్యక్తంగా ప్రకాశించే పిక్కలను కల్గిన వాడైన దేవుని భజిస్తున్నాను.

**19. శరణగజనచిత్తభక్తిపూర హ్రదకమలద్వితయం తదంఘ్రియుగ్మమ్।**
**మృదులశుభతరాంగుళీమనోజ్ఞం రుచిరనఖం పరిచుంబతాన్మనో మే॥**

భక్తి అనే నీటితో నిండిన,శరణాగతిని చేసినవారి చిత్తమనే కొలనులో తామర పూలజంటవలె శ్రీరాముని రెండుపాదాలు ఉన్నవి. సుకుమారమైన, గొప్ప మంగళ



కరమైన వేళ్ళతో మనస్సును ఆనందింపజేసేది, ప్రకాశించే గోళ్ళను కల్గినది అయిన ఆ శ్రీరాముని శ్రీచరణద్వయిని నా మనస్సు చుంబించాలి (మనస్సు ధ్యానించాలి.)

**20. రఘుకులమణి దివ్యసౌధదీపం సురుచిరరూపవిధూత పుష్పచాపమ్।**
**ఘనతరమదతాటకాస్వరూపజ్వలనశిఖాజలదం భజేఽభిరూపమ్॥**

రఘుకులమనే దివ్యమైన మణిసౌధంలోని దీపంవంటివాడు (ఆ వంశాన్ని ప్రకాశింపజేసేవాడు), గొప్పగా ప్రకాశించే రూపంతో మన్మథుని తిరస్కరించినవాడు (మించినవాడు), గొప్ప మదాన్ని కల్గిన తాటకయొక్క స్వరూపమనే జ్వలించే శిఖను (జ్వాలను) ఆర్పే మేఘంవంటివాడు, అందువల్లనే అందమైనవాడైన శ్రీరాముని భజిస్తున్నాను.

**21. చరణనఖపరాగజాత కన్యావితరణమోదిత గౌతమాతిమాన్యే।**
**విగలతు హృదయం మహావదాన్యే నవతరణే మమ భూసుతాప్తిధన్యే॥**

శ్రీచరణాల గోళ్ళయొక్క పరాగంతో (ధూళితో) అహల్య నిజరూపాన్ని పొందింది. ఆమెను ఇవ్వడం ద్వారా శ్రీరాముడు గౌతమమహర్షిని ఆనందింప జేశాడు. గొప్ప వదాన్యుడు, నవయువకుడు, సీతాదేవిని పొందడంచేత ధన్యుడు అయిన ఆ శ్రీరామునిపట్ల నా మనస్సు లగ్నం కావాలి.

**22. జనకవచనపాలనాత్తదీక్షే భరతమనోరథదాయిదివ్యదీక్షే।**
**విపినభువి విరాధదత్తశిక్షే సతతమియం మతిరస్తు దీనరక్షే॥**

శ్రీరాముడు తనతండ్రి వచనాన్ని పాటించడమనే దీక్షను కలవాడు. భరతుని మనోరథాన్ని అనుగ్రహించడమనే దివ్యమైన దీక్షను కలవాడు. అరణ్యంలో విరాధుని శిక్షించాడు. అతడు దీనరక్షకుడు - అటువంటి శ్రీరామునిపట్ల నా మనస్సు లగ్నం కావాలి.

**23. జరఠతమజటాయుముక్తిదాన ప్రకటితనైజమహావదాన్యభావే।**
**కపికులపతిక్లుప్తమిత్రభావే విహరతు మే హృదయం చిరాయ దేవే॥**

చాలా వృద్ధుడైన జటాయువునకు ముక్తిని అనుగ్రహించి శ్రీరాముడు తన గొప్పదైన దాతృత్వగుణాన్ని వ్యక్తం చేశాడు. కపిరాజు అయిన సుగ్రీవునిపట్ల స్నేహభావాన్ని కలవాడు అతడు. అటువంటి దేవునిలో నా హృదయం చిరకాలం విహరించాలి.

శ్రీకృష్ణబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామివారు (31వ పట్టం) అనుగ్రహించిన

# (8) శ్రీప్రపన్నమకరందస్తోత్రమ్ (లక్ష్మీస్తుతి)

1. **శ్రీవేంకటధరణీధరపతి వక్షఃస్థలవిశాలకేళిగృహమ్ ।**
**జగదుజ్జీవనసుస్మిత లలితముఖం తన్మమాస్తు వస్తు హృది ॥**

శ్రీవేంకటేశ్వరుని వక్షఃస్థలమనే విశాలమైన కేళీమందిరాన్ని కల్గినది, లోకాలను ఉజ్జీవింపజేసే చిఱునవ్వుతో అందమైన ముఖాన్ని కల్గినదైన లక్ష్మీదేవి అనే అద్వితీయతత్త్వం నా మనస్సులో నిలచి ఉండాలి.

2. **నిబరీసభ్రమరీరుచి కచరీసంగతమనోజ్ఞ సుమహారాన్ ।**
**కలయామహేఽత్యుదారాన్ మురరిపుదారాన్ కృతార్తిపరిహారాన్ ॥**

దట్టమైన తుమ్మెదల సమూహంవంటి శోభను కల్గిన కేశపాశంలో అలంకరింపబడిన అందమైన పూలహారాలను లక్ష్మీదేవి ధరించింది. ఆమె చాలా ఔదార్యాన్ని కల్గినది. (భక్తుల) ఆర్తిని హరిస్తుంది. మధుసూదనుని పత్ని అయిన ఆమెను ధ్యానిస్తున్నాము.

3. **నవవజ్రకలిత దినకరసితకిరణాభరణ రుచిరకచభారాన్ ।**
**కరుణాభరసుస్మేరాన్ రుచిరవిహారాన్ భజే హరేర్దారాన్ ॥**

నూతనమైన వజ్రాలతో పొదిగినవి కావడంచేత సూర్యుని తెల్లని కిరణాల వంటి కిరణాలను కల్గినవి అయిన ఆభరణాలతో ప్రకాశించే కేశభారాన్ని కల్గినది, కరుణతో నిండిన చిఱునవ్వును కల్గినది, అందమైన విహారాలను కల్గినది అయిన లక్ష్మీదేవిని భజిస్తున్నాను.

4. **కుంకుమతిలకితఫాలం విలులితసుస్నిగ్ధ ముఖకుంతలజాలమ్ ।**
**కలయే వదాన్యశీలం కలశాంబునిధేరపత్య మచ్యుతలోలమ్ ॥**

కుంకుమతిలకంతో కూడుకొన్న ఫాలాన్ని కల్గినది, దట్టమైన, మెఱిసే ముంగురుల సమూహాన్ని కల్గినది, వదాన్యగుణాన్ని కల్గినది, అచ్యుతునిపట్ల ఆసక్తిని కల్గినదైన క్షీరాబ్ధి పుత్రికను భావిస్తున్నాను.

5. **నిటిలవిజితేందుబాలం భ్రూవల్లిస్ఫురణ వశితయదుబాలమ్ ।**
**లక్ష్మీవదాన్యలీలం వస్తు మదీయేఽస్తు హృది వినతపాలమ్ ॥**



బాలచంద్రుని జయించిన ఫాలాన్ని కల్గినది, కనుబొమల కదలికలతో యావబాలుడైన శ్రీకృష్ణుని వశంచేసికొన్నది, సంపదను సమృద్ధిగా అనుగ్రహించే విలాసాలను కల్గినది, భక్తులను కాపాడేది అయిన (లక్ష్మీ అనే) వస్తువు నా హృదయంలో నిలచి ఉండాలి.

6. **చంపకసుమసమనాసాం సంపన్నిధిమాశ్రయేఽంబుధిం భాసామ్ ।**
**అమరీణాం సర్వాసాం శరణ్యచరణాం సరోరుహనివాసామ్ ॥**

సంపెగపూవువంటి నాసికను కల్గినది, సంపదకు నిధి, తేజస్సుకు సముద్రం వంటిది, దేవతాస్త్రీలకు అందఱికి గొప్ప శరణమైన శ్రీచరణాలను కల్గినది, పద్మాన్ని నివాసంగా కల్గినది అయిన లక్ష్మిని ఆశ్రయిస్తున్నాను.

7. **కువలయరుచిమద విఘటనపటునయనయుగం తవార్థికల్పనగమ్ ।**
**స్వాంతే కరోమి మురరిపుకాంతే! శాంతే! నితాంత మేకాంతే ॥**

ఓ మురారికాంతా! ప్రార్థించినవారికి కల్పవృక్షంవంటిది. కలువల శోభ యొక్క గర్వాన్ని పోగొట్టడంలో సమర్థమైనదైన నీ నేత్రద్వయిని నేను నామనస్సులో ఎల్లప్పుడు నిలుపుకొని ధ్యానిస్తాను.

8. **కలితాశ్రితార్తిభంగాన్ వశితమహాపురుష విభ్రమవిభంగాన్ ।**
**సంచింతయామ్యపాంగాన్ మంగళదేవ్యాః సదా మహోత్తుంగాన్ ॥**

ఆశ్రితుల ఆర్తిని విచ్ఛేదం చేసేవి, భగవానుని తన వశం చేసికొనే మహాపురుషుని విభ్రమరీతులను కల్గినవి (లక్ష్మీదేవి విభ్రమాల ప్రకారాలను చూచి భగవానుడు ఆమెకు వశం అవుతున్నాడు - అని భావం.) చాలా గొప్పవి అయిన మంగళదేవత (లక్ష్మీదేవి) యొక్క కటాక్షాలను ఎల్లప్పుడు స్మరిస్తున్నాను.

9. **వదనరుచిహ్రద విహరన్నయనమహామీనరాజ నిష్ఠ్యూతమ్ ।**
**నాసావివరవిలగ్నం నూనం ధ్యాయామి మౌక్తికం దేవ్యాః ॥**

లక్ష్మీదేవి ముఖం ఒక అందమైన సరోవరంవంటిది. ఆ సరోవరంలో విహరించే గొప్ప చేపలవంటివి ఆమె నేత్రాలు. ఆ నేత్రాలనే చేపలయొక్క నిష్ఠ్యూతం వలె (ఉమ్మివలె) ఆమె ముక్కులో అలంకరింపబడిన ముక్కెరలోని ముత్యం ప్రకాశిస్తున్నది. అటువంటి ఆ ముత్యాన్ని నేను తప్పక ధ్యానిస్తున్నాను.

10. **ముఖవిజితచంద్రబింబం ముగ్ధాధరకాంతి ధృతనవబింబమ్ ।**
**పంకజనయనకుటుంబం సంకలయే సర్వసురజనాలంబమ్ ॥**

ముఖంతో చంద్రబింబాన్ని జయించినది, మనోహరమైన అధరకాంతితో నూతనమైన దొండపండును పోలినది, సమస్తదేవతలకు ఆలంబనమైనది అయిన పుండరీకాక్షుని పత్నిని (లక్ష్మీదేవిని) ధ్యానిస్తున్నాను.

**11. సకలజగదగ్రగణ్యం సరసిజనయనస్య పరిణతం పుణ్యమ్ ।
అస్మాదృశాం శరణ్యం విభావయే మనసి కిమపి లావణ్యమ్ ॥**

సమస్తజగత్తులో అగ్రగణ్యమైనది, మావంటివారికి గొప్ప శరణమైనది, పుండరీకాక్షుని పండిన పుణ్యంవంటిది అయిన అద్వితీయలావణ్యాన్ని (లావణ్యరూపిణి అయిన లక్ష్మిని) మనస్సులో భావిస్తున్నాను.

**12. జగదీశ్వరత్వయోగ్యం జగదీశ్వరవిహరణైకతమభోగ్యమ్ ।
తత్కిమపి మహాభాగ్యం మమ నృత్యతు మనసి కల్పితారోగ్యమ్ ॥**

జగదీశ్వరత్వానికి యోగ్యమైనది (భగవానుని జగదీశ్వరత్వానికి అసాధారణ లక్షణం), జగన్నాదుడైన స్వామి విహరించడానికి మిక్కిలి భోగ్యమైనది (ఆనందాన్ని కల్గించేది), నా మనస్సుకు ఆరోగ్యాన్ని కల్గించినది అయిన అద్వితీయమైన ఆ గొప్పభాగ్యం (భాగ్యాధిదేవత అయిన లక్ష్మి) నా మనస్సులో నర్తించుగాక.

**13. శుభదాయినామధేయం సకలసురస్తోమ యువతిజనగేయమ్ ।
గోవిందభాగధేయం గోపాయతు మాం నతావళివిధేయమ్ ॥**

శుభాన్ని కల్గించే పేరును కల్గినది. దేవకాంతలందరిచేత స్తుతింపబడేది, ఆశ్రయించిన భక్తులకు విధేయమైనది అయిన గోవిందుని భాగధేయం (లక్ష్మి) నన్ను రక్షించుగాక !

**14. మలయానిలకేలిసఖం సుధాసహాధ్యాయి దివ్యతరరచనమ్ ।
వచనం సుధాబ్ధిపుత్ర్యా రచయతు సకలాం శ్రియం మమావికలామ్ ॥**

మలయానిలంవలె చల్లనిది, అమృతానికి సహాధ్యాయివంటి దివ్యమైన శబ్ద సందర్భాలను కల్గినది అయిన క్షీరాబ్ధిసుతయొక్క సూక్తి నాకు సమస్తసంపదలను కల్గించాలి.

**15. నిజదయితవదన విధురుచివిలోకనాయత్త ముకురయుగళమివ ।
విమలం కపోలయుగళం కమలాయాః చింతయాంతరంగ ! మమ ॥**



తన వల్లభుడైన భగవానుని ముఖమనే చంద్రునియొక్క కాంతిని దర్శించడం కోసం లక్ష్మీదేవి సిద్ధం చేసికొన్న రెండు అద్దాలవలె స్ఫురించే ఆమె యొక్క స్వచ్ఛమైన రెండు చెక్కిళ్ళను, ఓ మనసా ! ధ్యానించు.

**16. లక్ష్మ్యా వదనశశాంకం శ్రుతియుగ సంకలిత వజ్రతాటంకమ్ ।
ధ్యాయామి ధుతాంతంకం ముక్తామణిభూషితం గతాశంకమ్ ॥**

రెండు చెవులలో వజ్రాలు పొదిగిన దుద్దులను కల్గినది, భయాన్ని తీర్చేవి, ముత్యాలతో, మణులతో అలంకరింపబడినది, (భక్తుల) సందేహాలను తీర్చేది అయిన లక్ష్మీదేవియొక్క వదనచంద్రుని ధ్యానిస్తున్నాను.

**17. ధృతదివ్యకనకచేలాః కైరవబంధుస్తనంధయనిటాలాః ।
దివ్యాః కాశ్చన లీలా పాంతుః వికచపద్మవనలోలాః ॥**

లక్ష్మీదేవి ధరించిన దివ్యమైన బంగారు వస్త్రాలు, బాలచంద్రునివంటి ఆమె ఫాలభాగం, వికసించిన పద్మాల సమూహంలో ఆసక్తిని కల్గినవి అయిన అనిర్వచనీయాలైన ఆమె లీలలు మనలను కాపాడుగాక!

**18. చంచలకటాక్షరేఖాన్ కాంశ్చిదుదంచిత విభూషణమయూఖాన్ ।
కిలికించిత పరివంచితబలివంచక మానసాన్ భజామి రసాన్ ॥**

పైకి ఎగసే ఆభరణాల కిరణాలను కల్గినవి, బలిని వంచించిన భగవానుని మనస్సును తన కిలికించితాలతో వంచించేవి, అనిర్వచనీయాలైనవి, పరమ భోగ్యాలైన లక్ష్మీదేవియొక్క మిక్కిలి చలించే కటాక్షాలను భజిస్తున్నాను.

**19. కనకసరోరుహకుట్మల దాయాదస్తనభరాన్ గభీరతరాన్ ।
కలయామి రూపవిభవాన్ కాంశ్చన లీలాతరంగితాత్మవిభవాన్ ॥**

బంగారు పద్మాలయొక్క మొగ్గలకు దాయాదులైన (మొగ్గలవంటివి) స్తనాల భారాన్ని కల్గినవి, మిక్కిలి గంభీరమైనవి, విలాసాలతో తన యొక్క వైభవాన్ని వ్యాపింపజేసేవి, అనిర్వచనీయాలైనవి అయిన లక్ష్మీదేవియొక్క రూపవైభవాలను భావిస్తున్నాను.

**20. అమృతసఖవ్యాహారాన్ ఆశ్రయవిధుకిరణ మదహరణహారాన్ ।
విభవాన్ కాంశ్చిదపరాన్ విశ్వజగజ్జీవనస్తనక్షీరాన్ ॥**

అమృతంతో సమానమైన లక్ష్మీదేవియొక్క వచనాలు. అమృతానికి ఆశ్రయుడైన చంద్రుని కిరణాల గర్వాన్ని హరించే ఆమె ముత్యాల హారాలు,

సమస్తజగత్తును ఉజ్జీవింపజేసే ఆమె స్తనక్షీరాలు - అనే అపూర్వాలైన మఱికొన్ని ఆమె వైభవాలను భావిస్తున్నాను.

**21. నళినాలంకృతహస్తాం నళినాక్షస్య ప్రియాం సుగుణశస్తామ్ ।**
**ప్రణమామః శతశస్తాం శరణాగతరక్షణేష్వవిస్రస్తామ్ ॥**

పద్మంతో అలంకరింపబడిన హస్తాన్ని కల్గినది, పుండరీకాక్షునకు మిక్కిలి ఇష్టమైనది, సుగుణాలతో కీర్తింపబడేది, తనను శరణాగతి చేసినవారిని రక్షించడంలో అశ్రద్ధ లేనిది అయిన ఆ లక్ష్మీదేవికి పలు మార్లు నమస్కరిస్తున్నాము.

**22. మణిమయకంకణవలయాం కలితసురాధీశ ఖేదభరవిలయామ్ ।**
**కాంచనకాంచికలాపానంచిత విద్యుల్లతాసదృశరూపామ్ ॥**

మణులతో నిండిన కంకణవలయాలను (చేతి గాజులను) కల్గినది, ఇంద్రుని దుఃఖభారాన్ని పోగొట్టినది, బంగారు మొలనూలును కల్గినది, అందమైన విద్యుల్లతతో సమానమైన రూపాన్ని కల్గినది అయిన లక్ష్మీదేవిని నమస్కరిస్తున్నాను.

**23. శరణాగతభరణానఘచరణా మరుణాధరాం జగజ్జననీమ్ ।**
**కరుణాభరవరుణాలయ పరిణాహివిలోచనాం భజే శరణమ్ ॥**

శరణాగతులను భరించే (రక్షించే) అనఘాలైన శ్రీపాదాలను కల్గినది, ఎఱ్ఱని అధరాన్ని కల్గినది, కరుణతో నిండినవి, సముద్రమంత విస్తీర్ణాన్ని కల్గినవి (విశాలమైన) అయిన నేత్రాలను కల్గినది అయిన జగజ్జనని శరణంగా భజిస్తున్నాను.

**24. కిం బహుభిర్దైవైరిహ శంబరడంబరిహరస్య తామంబామ్ ।**
**అంబుజనయనసఖీం విధుబింబముఖీం సంశ్రయానిశం హృదయ! ॥**

ఓ హృదయమా ! పలువురు దైవాలతో ఏమి పని ! శంబరాసురుని గర్వాన్ని అణచిన మన్మథునకు తల్లి, పుండరీకాక్షుని సఖి, చంద్రునివంటి ముఖాన్ని కల్గినది అయిన లక్ష్మీదేవిని నిత్యం ఆశ్రయించు.

**25. లలితపదం కలితముదం జననిపదం శ్రేయసాం పఠన్ విశదమ్ ।**
**స్తవమిహ తవ ప్రపన్నానందం విందత్యమంద మానందమ్ ॥**

లలితపదాలలో కూడుకొన్నది, ఆనందాన్ని కల్గించేది, శ్రేయస్సులకు జన్మస్థానమైనది, ప్రపన్నులకు ఆనందాన్ని కల్గించేది అయిన ఈ స్తుతి పఠించేవాడు గొప్ప ఆనందాన్ని పొందుతాడు.



**26. స్తుతిమితి మహీశూరపురీ చామమహీపాల కులసమృద్ధికృతే ।**
**తత్కులగురుః వ్యతానీత్ శ్రీకృష్ణబ్రహ్మతంత్రపరకాలః ॥**

మహీశూరపురానికి (మైసూరుకు) ప్రభువైన చామమహీపాలుని కులాభివృద్ధి కోసం ఈ విధంగా లక్ష్మీస్తుతిని చామమహీపాలుని కులగురువైన శ్రీకృష్ణబ్రహ్మ తంత్ర పరకాలస్వామి రచించారు.

శ్రీకృష్ణబ్రహ్మతస్వతంత్ర పరకాలస్వామివారు (31వ పట్టం) అనుగ్రహించిన

## (9) శ్రీరామానుజార్య ప్రాబోధికస్తుతి

**1. నిరాలోకే లోకే విమతకథకధ్వాంతనివహైః**
**శ్రియఃపత్యాఽజ్ఞప్తో ధరణిమవతీర్యాతికృపయా ।**
**వ్యతానీత్ యో భాష్యద్యుమణి మఖిలాజ్ఞానశుచయే**
**స జీయాత్ శ్రీరామానుజమునివరాత్మా ఫణిపతిః ॥**

దుర్మతాలను పలికేవారనే చీకటి సమూహాలచేత లోకం అంతా ప్రకాశం లేనిది కాగా, శ్రియఃపతిచే ఆజ్ఞాపింపబడినవారై, గొప్ప కృపతో భూమిపై అవతరించిన వారు, శ్రీభాష్యమనే సూర్యుని సమస్తమైన చీకటి (అజ్ఞానాన్ని) పోగొట్టడంకోసం అనుగ్రహించినవారు, శ్రీరామానుజులరూపంలో ఉండే వారైన ఆ ఆదిశేషులు వర్ధిల్లాలి.

**2. భాష్యం యస్య నిశమ్య లక్ష్మణమునేః కౌతూహలాత్ భారతీ**
**సూత్రాణా మిద ముత్తమం వివరణం నిశ్చిత్య మానానుగమ్ ।**
**వాగీశస్య నిజప్రియాయ నిఖిలాన్ వేదాన్ ప్రదాతుః శుభాం**
**మూర్తిం స్వేన సదార్చితాం సమదదాత్ యస్మై స యాన్మునిః ॥**

సరస్వతీదేవి కుతూహలంతో శ్రీరామానుజుల శ్రీభాష్యాన్ని ఆలకించి, బాదరాయణుని బ్రహ్మసూత్రాలకు ఇది ఉత్తమమైనది, ప్రమాణానుకూలమైన వివరణమని నిశ్చయించి, తాను నిత్యం ఆరాధించే, తనకు ఇష్టుడైన, బ్రహ్మకు వేదాలను అన్నిటిని ప్రదానం చేసిన హయగ్రీవునియొక్క మూర్తిని అనుగ్రహించింది. అటువంటి శ్రీరామానుజులు వర్ధిల్లాలి.

3. నృప ఉపరిచరాఖ్యో వ్యాసమాతామహో భూ
వివరముపగతోఽపి హ్యర్హణం సాత్వతోక్తమ్ ।
వ్యతనుత నియతం ప్రాక్ జాగృహి త్వం యతీంద్ర!
త్వరితమభిగమాద్యై రర్చితుం వాగధీశమ్ ॥

ఉపరిచరవసువు అనే రాజు వ్యాసునకు మాతామహుడు. అతడు శాపవశంచేత పాతాళలోకానికి వెళ్ళినా, పాంచరాత్రాగమానికి చెందిన సాత్వతసంహితకు అనుగుణమైన ఆరాధనాక్రమాన్ని పూర్వం రచించాడు. శ్రీరామానుజా! ఆక్రమంలో అభిగమాదులతో హయగ్రీవుని ఆరాధించడంకోసం నీవు మేల్కొనాలి.

శ్రీకృష్ణబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామివారు (31వ వట్టం) అనుగ్రహించిన

## (10) లక్ష్మీహయవదన ప్రాబోధికస్తుతి

1. కరుణావరుణాలయాంబుజ శ్రీస్ఫురణాహంకృతిహారిలోచన శ్రీః ।
చరణాబ్జనతార్తిభారహారిన్! తవ భూయాత్తురగాస్య! సుప్రభాతమ్ ॥

ఓ హయగ్రీవస్వామీ! కరుణకు సముద్రంవంటివి, పద్మాల శోభయొక్క స్ఫూర్తిని (సామ్యాన్ని) కల్గినవి, అహంకారాన్ని తొలగించేవి అయిన తిరునేత్రాల శోభను కలవాడా! నీ శ్రీచరణపద్మాలలో శరణాగతి చేసినవారి ఆర్తిని తీర్చేవాడా! నీకు సుప్రభాతం అగుగాక.

2. పురః ప్రబుద్ధాంబుధిరాజకన్యా ముఖాబ్జనిఃశ్వాసమివానుకుర్వన్ ।
మరుత్ సుగంధిః ప్రతవాతి మందం హయానన ! స్యాత్ తవ సుప్రభాతమ్॥

నిద్రలేచిన లక్ష్మీదేవియొక్క పద్మంవంటి ముఖంనుండి వెలువడే నిశ్వాసాన్ని అనుకరిస్తూ పరిమళాన్ని కల్గిన వాయువు మెల్లగా నీముందు వీస్తున్నది. హయగ్రీవ స్వామీ! నీకు సుప్రభాతం.

3. త్వద్దీప్త్యా ప్రవిమలయా జితః కిలాసౌ
ఆహోస్విత్ తవ దయితాముఖాంబుజేన ।
పాశ్చాత్యే పతతి పయోనిధౌ సుధాంశుః
భూయాత్తే సపది హయాస్య! సుప్రభాతమ్ ॥

హయగ్రీవస్వామీ! మిక్కిలి విమలమైన నీ కాంతిచేత జయింపబడినందు వల్లనో, లేక, నీకు వల్లభ అయిన లక్ష్మీదేవి ముఖారవిందంచేత జయింపబడినందు



వల్లనో, ఈ చంద్రుడు పడమటి సముద్రంలో పడిపోయాడు. (అస్తమించాడు) నీకు వెంటనే సుప్రభాతం అగుగాక !

4. వరదానకృతిన్ ! స్మరదార్తతర -
ద్విరదాఘహృతి స్ఫురదాదరణ! ।
ఇతి సన్మతయో యతయః ప్రపదం
త్యధునా మధునాశన ! జాగృహి భోః ॥

"వరాలను అనుగ్రహించేవాడా ! (నిన్ను) స్మరించేవాడు, మిక్కిలి ఆర్తుడైన గజేంద్రుని పాపాన్ని (ఆర్తిని) హరించడంలో వ్యక్తం చేసిన ఆదరాన్ని కలవాడా!"- అని అంటూ గొప్ప మతిని కల యతులు పల్కుతున్నారు. ఓ మధువనే అసురుని సంహరించిన హయగ్రీవా! నీవు మేల్కొనాలి.

5. సమర్చనే తే కృతకౌతుకేన
సజ్జీకృతం శోణమణీంద్ర పీఠమ్ ।
హంసేన కిం సాంధ్య మహో! విభాతి
హయాస్య ! భూయాత్తవ సుప్రభాతమ్ ॥

హయగ్రీవస్వామీ! నీకు అర్చన చేయాలనే ఆసక్తితో హంసచేత సిద్ధం చేయబడిన ఎఱ్ఱని మణులు పొదిగిన సింహాసనంవలె ప్రాతఃకాలికసంధ్య ప్రకాశిస్తున్నది. నీకు సుప్రభాతమగుగాక!

6. హరిర్హరిరితి మంజుభాషితం
ద్విజావళేః సపది నిశమ్య కౌతుకాత్ ।
వరద్విజోఽప్యనువదతీవ కూజితైః
హయాననానఘగుణ! జాగృహి ప్రభో! ॥

"హరిః హరిః హరిః" అంటూ బ్రాహ్మణసమూహం ఉదయం నిద్రలేవగానే మెల్లగా పలికే మాటను విని, ఆసక్తితో గొప్ప పక్షులుకూడా దానిని అనువదిస్తున్నట్లు వాటి ధ్వనులు తోస్తున్నవి. హయగ్రీవస్వామీ! ఏదోషం లేని గుణాలను కలవాడా! ప్రభూ! నిద్రనుండి లే.

7. ప్రాచీం వధూం సపది మిత్రకరగ్రహార్థం
సంధ్యావధూః స్వరుచికుంకుమపంకసాంద్రైః ।

ప్రాలేయమంగళజలై రభిషించతీవ
శ్రీమన్ ! హయాస్య ! భవత్తాతవ సుప్రభాతమ్ ॥

లక్ష్మీపతీ! హయగ్రీవస్వామీ! ప్రాతఃకాలసంధ్య అనే స్త్రీ తూర్పు దిక్కు అనే వధువు వెంటనే సూర్యుడనే వరుని పాణిగ్రహణం చేసికోవడంకోసం ఆమెకు తన కాంతి అనే కుంకుమ పంకంతో చిక్కని మంచు అనే మంగళజలంతో మంగళస్నానాన్ని చేయిస్తున్నట్లున్నది. (సంధ్యాకాలపు ఎఱుపు రంగుతో తూర్పు దిక్కుప్రకాశిస్తున్నది) నీకు సుప్రభాతమగుగాక!

8. కుముదవనం విముచ్య నవపంకజషండమిమాః
సపది సమాశ్రయంతి ముదితా భ్రమరావలయః ।
భువి నిఖిలోఽపి చాశ్రయతి స శ్రియమేవ జనో
హయవదనాద్య జాగృహి (హరే!) కరుణైకనిధే! ॥

హయగ్రీవా! కరుణకు అద్వితీయమైన నిధివంటివాడా ఉదయం అయినందువల్ల తుమ్మెదల సమూహాలు ఇపుడు కలువల సమూహాన్ని విడచిపెట్టి, కొత్తగా వికసించిన ఈ తామరల గుంపును ఆనందంతో వెంటనే ఆశ్రయిస్తున్నవి. లోకంలో ప్రతివ్యక్తి సంపదను కలవానినే కదా ఆశ్రయిస్తాడు. హయగ్రీవస్వామీ! ఇపుడు మేలుకో.

9. ఫుల్లత్పంకజరత్నపాత్రనివహానాసాద్య హృద్యశ్రియః
సౌగంధాఢ్యమరందదివ్యసలిలై రాపూరితా నాదరాత్ ।
హంసా స్త్వామివ పూజయంతి విరుతవ్యాజాత్ పఠంతో మనూన్
సుస్నాతాః సరసీషు వాహముఖ! తే సుప్రాతరస్తు ప్రభో ! ॥

సుగంధంతో గొప్పదైన మకరందమనే దివ్యజలంతో నిండినవి, మనోహరమైన శోభను కల్గినవైన వికసించిన తామరపూవులు అనే రత్నాల పాత్రలను ఆదరంగా గ్రహించిన హంసలు (సన్యాసులు) సరస్సులో చక్కగా స్నానం చేసి, తాము చేసే మధురధ్వనులనే మంత్రాలను ఉచ్చరిస్తూ నిన్ను పూజిస్తున్నట్లుగా ఉన్నది. ఓ హయగ్రీవా! ప్రభూ! నీకు సుప్రభాతం.

10. ఉచ్చలన్ మధుకరౌఘమంజులం
పద్మముల్లసతి పూజనాయ తే ।
ధూపపాత్ర మివ హంససజ్జితం
సుప్రభాత మిహ తే హయానన! ॥



తుమ్మెదల సమూహంతో మనోహరంగా ప్రకాశిస్తూ, నీ పూజకోసం పద్మం రేకులను వెలువరిస్తూ వికసిస్తున్నది. అది, హంస (యతి) నీపూజకోసం సిద్ధం చేసిన ధూపపాత్రవలె ఉన్నది. హయగ్రీవస్వామీ ! నీకు సుప్రభాతం.

11. ఇందీవరాణామివ కాంతి రద్య
మందీభవంతీ వ్యపయాతు నిద్రా ।
ఫుల్లత్విదం పద్మమివాక్షియుగ్మం
హయాస్య! తే సంప్రతి సుప్రభాతమ్ ॥

కలువల కాంతి ఇపుడు తరిగిపోతున్నట్లుగా నీ నిద్రకూడా తరిగిపోవాలి. పద్మాలు వికసించినట్లుగా పద్మాలవంటి ఈ నీ నేత్రాల జంట వికసించాలి. ఓ హయగ్రీవస్వామీ! నీకు సుప్రభాతం.

12. ఏతే వేత్రహతిత్రుటత్ పటుమహా కోటీరకోటీమణి-
శ్రేణీభి స్తవ మందిరస్య దధతో ద్వారాయ నీరాజనమ్ ।
కాంక్షంతి ప్రతిబోధకాల మిహ తే సర్వే సుపర్వాధిపాః
తానేతాన్ కరుణావలోకనలవైః ధన్యాన్ విధేహి ప్రభో! ॥

ప్రభూ! హయగ్రీవా! వేత్రధారులు (చేతి బెత్తాన్ని ధరించిన రక్షకులు) బెత్తంతో అదలిస్తూ కొట్టినందువల్ల దేవతల ప్రభువుల శిరస్సుపై ధరించిన గొప్ప గొప్ప కిరీటాల అగ్రభాగాలలో పొదిగిన మణులు పగులుతున్నాయి. ఆ మణుల కాంతులతో వారు నీ ఆలయద్వారానికి నీరాజనాన్ని చేస్తూ, నీవు నిద్ర లేచే కాలం కోసం ఎదురు తెన్నులు చూస్తున్నారు. వీరిని అందఱిని నీ కరుణాకటాక్షలతో (అరమోడ్పు కన్నుల చూపులతో) ధన్యులనుగా చేయాలి.

13. అక్షీణే మయి తిష్ఠ కిం విహరసే సంక్షీయమాణే ముహుః
బింబేఽస్మిన్నితి దేవదేవ! నితరాం త్వత్ ప్రార్థనాయాగతమ్ ।
చాంద్రం బింబమిదం వదంతి హి పరం మోదార్పణం దర్పణం
దృష్టిం న్యస్య కృపానిధేఽత్ర భగవన్ ! ప్రాబోధికీం శ్రీపతే! ॥

దేవదేవా! ఆగు. ఏనాడూ క్షీణించని నేనుండగా, మాటిమాటికి క్షీణించే ఈ చంద్ర బింబంలో విహరిస్తావా! - అని అంటూ నిన్ను ప్రార్థించడంకోసం వచ్చిన

భక్తులు చంద్రబింబాన్నిగూర్చి అంటున్నారు. మిక్కిలి ఆనందాన్ని కల్గించే ఈ అద్దంలో నీ మొదటి చూపును నిలిపి కృపజేయి. భగవన్! శ్రీపతీ! కృపానిధీ! నీకు సుప్రభాతం.

**14.** **నిద్రాశేషకషాయితైః సులలితైః ఉద్యద్దయాప్యాయితైః**
**దివ్యాపాంగఝరైః త్వదర్చనకృతే ద్వార్యత్ర బద్ధాంజలీన్ ।**
**ఆచార్యాన్ నిగమాంతదేశికముఖానాధత్స్వ సుస్నాపితాన్**
**సుప్రాతం తురగాస్య! తేఽస్తు కరుణాసింధో! దినం శ్రీపతే! ॥**

నిద్ర ఇంకా మిగిలి ఉండడంవల్ల ఎఱ్ఱనివి, మిక్కిలి అందమైనవి, పెల్లుబికే దయతో తృప్తి పఱచేవి అయిన నీ దివ్యకటాక్షాల ప్రవాహాలతో, నిన్ను అర్చించడం కోసం ఇక్కడ ద్వారంలో అంజలి చేస్తున్న వేదాంతదేశికులు మొదలైన పూర్వాచార్యులను బాగా స్నానం చేసిన వారినిగా (ఆనందింపజేసినవారినిగా) నీవు చేయాలి. ఓ హయగ్రీవస్వామీ! కరుణాసింధూ! శ్రీపతీ! నీకు సుప్రభాతం.

**15.** **ఇదం కుంభద్వంద్వం ఘుసృణమసృణస్మేరసలిలం**
**ప్రతీహారే లక్ష్మీస్తనయుగమనోహారి లసతి ।**
**ఇయం గౌః సద్వత్సా పరిజనసమూహోఽపి నిభృతో**
**దివం సుప్రాతం తే భవతు కరుణాబ్ధే ! హయముఖ ॥**

యాలకుల పొడితో, పచ్చకర్పూరంతో చిక్కని తెల్లని నీటిని కల్గినది, లక్ష్మీదేవి స్తనయుగంవలె మనోహరమైనది అయిన పూర్ణకుంభద్వయం ఇదిగో. ఇది లేగ దూడతో కూడి ఉండే గోవు. పరిజనసమూహం కూడా వినయంగా నిలచి ఉన్నారు. కరుణాసముద్రా! హయగ్రీవస్వామీ ! నీకు సుప్రభాతం.

**16.** **రవిమండలీమిదానీ ముదయమహీభృత్తవాభిషేకార్థమ్ ।**
**కనకకలశీమివ వహత్యస్తు హయగ్రీవ! సుప్రభాతం తే ॥**

హయగ్రీవస్వామీ ! సూర్యమండలం ఇపుడు ఉదయాద్రిపై నీ అభిషేకం కోసం సిద్ధం చేయబడిన కనకకలశంవలె ఉన్నాడు. నీకు గొప్ప సుప్రభాతం.

**17.** **అనుచిత ఇవ సేవనే త్వదీయే**
**ప్రమదభరాదిహ పంచమం విహాయ ।**
**విదధతి కిల వైణికాశ్చ గానం**
**హయవదనాద్య తవాస్తు సుప్రభాతమ్ ॥**



నీ సేవలో తగినది కాదు అనేటట్లు ఆనందాతిరేకంవల్ల వైణికులు అందఱు పంచమస్వరాన్ని విడచిపెట్టి గానాన్ని చేస్తున్నారు కదా! హయగ్రీవస్వామీ! నీకు ఇపుడు సుప్రభాతం.

**18.** **పికనికరమదవిధూనన గానమనోహర ముదారసుకుమారమ్ ।**
**ధన్యం కన్యాద్వంద్వం త్వాం నీరాజయతి జాగృహి హయాస్య! ॥**

హయగ్రీవా! కోకిలసమూహంయొక్క మదాన్ని ఎగురగొట్టే గానంతో మనోహరమైనది, గొప్ప సుకుమారమైనది, ధన్యమైనది అయిన కన్యాద్వంద్వం (ఇద్దరు కన్యలు) నీకు నీరాజనాన్ని చేస్తున్నది. మేలుకో.

**19.** **కాహలడిండిమమండల మర్దలపణవాద్య వాద్యానామ్ ।**
**సంస్పర్ధయేవ నినదో విజృంభతే తురగవదన! బుధ్యస్వ ॥**

బాకాలు, ఢక్కలు, మద్దెలలు, డప్పులు మొదలైన వాద్యవిశేషాల ధ్వని ఒకదానితో ఇంకొకటి పోటీపడుతున్నట్లుగా విజృంభిస్తున్నది. హయగ్రీవా ! నిద్రలే.

**20.** **తవ తనురుచిసాధర్మ్యాత్ సంహృష్టే నర్తనం కిలాతనుతః ।**
**ద్వారభువి చామరే ద్వే హయవదన ! తవాస్తు సుప్రభాత మిహ ॥**

హయగ్రీవస్వామీ ! నీ దేహకాంతియొక్క పోలిక వల్ల మిక్కిలి ఆనందించిన రెండు చామరాలు ద్వారంలో నర్తనం చేస్తున్నట్లున్నవి కదా ! నీకిక్కడ సుప్రభాతం.

**21.** **త్వత్పాదాంభోజయుగ్మం పరిచరితుమనా మూర్ధ్ని బుద్ధాంజలిస్సన్**
**శ్రీకృష్ణబ్రహ్మతంత్రాగ్రిమ పదకలిజిత్ సంయమీ త్వాం స్తవీతి ।**
**త్వత్సేవాయై సముద్యన్నిరవధికమహానందధు స్తిష్ఠతీహ**
**శ్రీమాన్ కృష్ణావనీంద్రో హయవదన! తవ శ్రీశ ! సుప్రాతరస్తు ॥**

హయగ్రీవస్వామీ ! నీపాదాంభోజాల జంటను సేవించే మనస్సును కలవారై, శిరస్సుపై అంజలిని పెట్టుకొని, శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాల స్వామి యతీంద్రులు నిన్ను స్తుతిస్తున్నారు. నీ సేవకోసం ప్రయత్నించేవాడై, గొప్ప ఆనందాన్ని కలవాడైన శ్రీకృష్ణభూపతి ఇక్కడ నిలచి ఉన్నాడు. నీకు సుప్రభాతం.

**22.** **జయ జయ నిత్యసూక్తి లలనామణిమౌళిమణే!**
**జయ జయ భక్తసంహతిభవాబ్ధి మహోతరణే! ।**
**జయ జయ వేదమౌళిగురుభాగ్య దయాజలధే!**
**జయ జయ వాజివక్త్ర! పరకాలయతీంద్రనిధే! ॥**

నిత్యవాక్కులైన వేదాలనే కన్యకామణిశిరస్సుపైగల మణివంటివాడా! (వేదాంతప్రతిపాద్యుడా) నీకు జయం. భక్తసమూహంయొక్క సంసారసముద్రాన్ని ఇంకింపజేసే సూర్యునివంటివాడా! నీకు జయం జయం. వేదాంతదేశికుల భాగ్యమా! దయాసముద్రమా! జయం జయం. హయగ్రీవా! పరకాలయతీంద్రులకు నిధివంటివాడా! నీకు జయం జయం.

శ్రీకృష్ణబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామివారు (31వ వట్టం) అనుగ్రహించిన

## (11) శ్రీనిగమాంతమహాదేశిక ప్రాబోధికస్తుతి

1. **శేషాద్రీశ్వరపాదపద్మయుగళీ కైంకర్యహేతోః పురా**
**యా ఘంటా కిల భక్తినమ్రమనసా పద్మాసనేనార్పితా ।**
**తత్తత్ తత్ర పిశాచధూననకృతే సంకల్పతః శ్రీపతేః**
**జాతాయై నిగమాంతదేశికమి షాత్ కస్యైచిదస్యై నమః ॥**

పూర్వం శేషాద్రీశుడైన వేంకటేశ్వరుని పాదపద్మాల జంటకు సేవచేయడం కోసం భక్తివల్ల వినమ్రమైన మనస్సును కల బ్రహ్మ ఏ ఘంటను అర్పించాడో, ఆ ఘంటయే ఆయా చోట్ల ఉండే పిశాచాలను తరిమివేయడంకోసం శ్రియఃపతి సంకల్పంవల్ల నిగమాంతదేశికుల రూపంలో అవతరించింది. ఈ అద్వితీయమైన ఘంటకు నమస్కారం.

2. **జిహ్వాసింహాసనాగ్ర స్ఫుటనటన తురంగాస్యమంజీరసింజా-**
**స్పర్ధాం నిర్ధార్య వాచా నిచయచుళకితప్రత్యనీకప్రచారః ।**
**శ్రీమాన్ రామానుజార్యప్రథితతమమతశ్రీలలామార్కధామా**
**నిత్యం శ్రుత్యంతవిద్యాగురురిహ జగతాం భద్రవత్తాం విధత్తామ్ ॥**

తన జిహ్వా అనే సింహాసనాగ్రంలో స్ఫుటంగా నాట్యం చేసే హయగ్రీవుని యొక్క కాలి అందెల మధురమైన ధ్వనివంటివి, వాదంలోని సిద్ధాంతనిర్ధారణను చేసేవి అయిన వాక్కులతో ప్రతివాదిసిద్ధాంతప్రచారాలను పుడిసిలో పానం చేసినవాడు (నిరోధించి లేకుండా చేసినవారు), భగవద్రామానుజులచే ప్రవర్తింపజేయ బడిన ప్రసిద్ధమతం విశిష్టాద్వైతమనే ప్రకాశించే సూర్యునకు నివాసస్థానమైన, అయిన వేదాంతదేశికులు లోకాలకు అన్నిటికి మంగళాలను నిత్యం కల్గించాలి.



3. **సంసారాటోపతాప క్షపణనిపుణవాగ్ధోరణీ సారణీశ్రీ**
**వాణీసంపూజ్యపాదాదిమ తురగముఖామందురానందరాశిః ।**
**సంఖ్యాతీతప్రబంధ ప్రశమిత విమతాతంకశంకాకలంకో**
**మోదాన్ వేదాంతసూరి ర్దిశతు గురువరః సర్వతంత్రస్వతంత్రః ॥**

సంసారంయొక్క గొప్ప తాపాన్ని నశింపచేయడంలో సమర్థమైన సందర్భాల క్రమాలతో ప్రకాశించే వాక్కులద్వారా ఆరాధింపబడిన పాదాలను కల్గిన హయగ్రీవుడనే గొప్ప ఆనందరాశిని కలవారు, లెక్కలేనన్ని కృతులద్వారా ప్రతివాదులవల్ల కల్గిన సందేహాలు, భయాలు అనే కళంకాన్ని తీర్చినవారు, సర్వతంత్రస్వతంత్రులైన వేదాంతదేశికులు అనే ఆచార్యవర్యులు (నాకు) ఆనందాన్ని కలుగజేయాలి.

(వేదాంతదేశికుల వాక్కులు సంసారతాపాన్ని పోగొట్టడంలో సమర్థమైనవి. అటువంటి గొప్ప శబ్దసందర్భాల క్రమాన్ని కల వాక్కులతో ఆ ఆచార్యవర్యులు హయగ్రీవుని శ్రీచరణాలను ఆరాధించారు. ఆ హయగ్రీవస్వామి ఘనమైన ఆనందాన్ని కలవాడు. వేదాంతదేశికులు లెక్కకు మించిన గ్రంథాలను రచించి, వాటిద్వారా విమతాల వల్ల కల్గిన భయాలు, సందేహాలు - అనే కళంకాలను పోగొట్టారు. వారు సర్వతంత్రస్వతంత్రులనే బిరుదును కలవారు ఆచార్యవర్యులు. అటువంటి వేదాంతదేశికులు (నాకు) ఆనందాన్ని కల్గించాలి.

4. **పాదారవిందయుగళీ నతచేతనాఘ -**
**ఖేదాపహారికరుణాదిగుణాంబురాశే ।**
**మోదాయ సర్వజగతాం భవతాత్ నితాంతం**
**వేదాంతదేశికమణే ! తవ సుప్రభాతమ్ ॥**

పాదారవిందాల జంటను నమస్కరించిన చేతనుల పాపాలను, దుఃఖాలను పోగొట్టే (మీ) కరుణ మొదలైన గుణాలకు సముద్రంవంటివాడా! వేదాంతదేశిక మణీ! సమస్తలోకాల గొప్ప ఆనందంకోసం నీకు సుప్రభాతం అగుగాక!

5. **వైదుష్యాద్యవలేపలేపపదవీసంచారదూరో గురుః**
**నిత్యం గంధవహోఽ స్మ్యహం తు తది తో భీతేన భావ్యం మయా ।**
**ఇత్థం మందగతిః సదాగతిరిహ ప్రాభాతికో వాత్యసౌ**
**శ్రీమన్! శ్రీనిగమాంతదేశికమణే ! స్యాత్ సుప్రభాతం తవ ॥**

"పాండిత్యాదిగర్వాలయొక్క లేపాన్ని (పూతను సంబంధాన్ని) కల మార్గం లోని సంచారానికి దూరంగా ఉండే గురువు వీరు. నేను ఎల్లప్పుడు గంధాన్ని మోసికొని పోయేవాడనుకదా! అందువల్ల చాలా భీతితో జాగ్రత్తగా వీచాలి" అని తలచిన ప్రభాతసమయంలోని వాయువు మెల్లగా మందంగా వీస్తున్నది. శ్రీమన్! వేదాంతదేశిక గురువర్యా! మీకు సుప్రభాతం.

6. తమోఽవశ్యం నశ్యేత్ ప్రచురమపి తత్ తాదృశగురు-
ప్రబోధే సంజాతే న విషయ ఇహాస్తీతి తమిమమ్ ।
నృణా మర్థం సమ్యక్ ప్రకటయసి చేత్ భ్రశ్యతి తమః
విబుధ్యస్వ శ్రీమన్ ! నిగమమకుటీదేశికమణే ! ॥

వేదాంతదేశికమణీ ! శ్రీమన్ ! తమస్సు చీకటి, అజ్ఞానం) గాఢమైనది. అయినా, అటువంటి (మావంటి) ఆచార్యుల ప్రబోధం (ఉపదేశం, మేల్కొనడం) జరిగితే తప్పక నశిస్తుంది. ఈలోకంలో విషయం ఏమీ లేదనే పరమార్థాన్ని లోకానికి నీవు వ్యక్తం చేస్తే తమస్సు (చీకటి, అజ్ఞానం) నశిస్తుంది. అందువల్ల మేలుకో.

7. నిత్యం పూర్ణకలః కదాపి తమసా నైవాభిభూతో గురుః
యుక్తాస్య ద్విజరాజతా మమ పునః నైవోచితా దృశః ।
ఇత్యస్తాద్రిగుహాగృహేషు నియతం లీనో హ్రియా చంద్రమాః
స్వామిన్ ! శ్రీకవితార్కికద్విపహరే ! స్యాత్ సుప్రభాతం తవ ॥

స్వామీ! కవితార్కికసింహా! ఆచార్యుడు నిత్యం పూర్ణుడు (జ్ఞానపూర్ణుడు) ఏనాడూ తమస్సుతో (అజ్ఞానంతో) ఆవరింపబడినవాడు కాదు. అందువల్ల ద్విజరాజత్వం (బ్రాహ్మణశ్రేష్ఠత్వం) ఆచార్యునకే (నీకే) తగినది. నాకు తగినది కాదు - అని భావించి చంద్రుడు పశ్చిమాద్రి గుహలనే ఇంటిలో దాగిపోయాడు. ఇది నిశ్చయం. నీకు సుప్రభాతం.

8. మహాభే సత్త్వాఢ్యే వితమసి గురౌ జాగ్రతి తమో
రుచీనామస్మాకం కథ మిహ భవేత్ సత్త్వమితి కిమ్ ।
హ్రియా మ్లాని ర్భాని ద్యవి దధతి సర్వాణ్యతితరాం
జహీహి త్వం నిద్రాం కవికథకకంఠీరవగురో! ॥

సత్త్వగుణపూర్ణుడు, కొంచెం కూడా తమస్సు లేనివాడు, గొప్ప కాంతిని కలవాడైన గురువు (గురువనే గొప్పనక్షత్రం) ప్రకాశిస్తూ ఉండగా, మన అల్పమైన



కాంతులకు ఏవిధంగా సత్త్వం (అస్తిత్వం) ఉంటుంది? (ఏవిధంగా మనం నిలువ గలం?) అనే సిగ్గుతో నక్షత్రాలు అన్నీ ఆకాశంలో మిక్కిలిగా కాంతివిహీనతను పొందుతున్నాయి. వేదాంతదేశికగురూ! ఇక నీవు నిద్రను వీడాలి.

9. ఏతే ద్విజా విపులశాఖమహాగమాంత -
నిష్ఠాః ప్రబోధమధిగమ్య రుతచ్ఛలేన ।
తత్త్వం పరం పరమివ ప్రతిబోధయంతి
శ్రుత్యంతదేశికమణే ! తవ సుప్రభాతమ్ ॥

గొప్పవైన వేదాంతశాఖలను అధ్యయనం చేసి, వాటిలో నిష్ఠను కల ఈ ద్విజులు (బ్రాహ్మణులు) నిద్ర లేచి పరంపారాగతమైన ఆ వేదాంతంలోని పరతత్త్వాన్ని ప్రబోధిస్తు న్నట్లుగా, విశాలమైన శాఖలను కల్గిన గొప్ప వృక్షాలపై నివసించే ఈ పక్షులు నిద్ర లేచి తమ కిలకిలారావాలతోను ఒకదాని తరువాత ఇంకొకటి చేస్తున్నవి. వేదాంతదేశికమణీ ! నీకు సుప్రభాతం.

10. అంతర్హితౌ లసతి ధామనిధౌ ప్రకాశ-
మత్యంత మేత్య జగతాం జనయన్ ప్రబోధమ్ ।
ప్రాచీప్రదేశ ఇహ భాతి భవానివైషః
ప్రాచీనవాక్శిఖరదేశిక ! జాగృహి త్వమ్ ॥

ప్రకాశించే తేజోనిధి అయిన సూర్యుని తనలో కల్గిన ఈ తూర్పు దిక్కు మిక్కిలి వెతురును కల్గినదై, లోకానికి ప్రబోధాన్ని కల్గిస్తూ (హృదయంలోపల జ్ఞాననిధి అయిన శ్రీమన్నారాయణుడు వెలుగుతూ ఉండగా, గొప్ప జ్ఞానాన్ని పొంది లోకానికి ప్రబోధాన్ని కల్గించేవలె, ప్రకాశిస్తున్నది. ఓ వేదాంతదేశికగురువర్యా! నీవు మేలుకో.

11. తేజస్వితాం దధదుదారతమో విధూయ
విః స్నేహభావ ముపగమ్య దశావసానే ।
శాంతోద్య హంత! హరిపాదసమర్పితాత్మా
దీపః ప్రసన్న ఇవ జాగృహి దేశికేంద్ర! ॥

(ఈ శ్లోకం దీపానికి, ప్రపన్నునకు సామ్యాన్ని ప్రతిపాదిస్తున్నది.) వెలుతు రును కల్గినదై, దట్టమైన చీకటిని పారదోలి, క్రమంగా నూనె తరిగిపోయినందువల్ల,

వత్తి కాలిపోయి, చివరిదశకు చేరినందువల్ల శాంతమై ఆరిపోయింది. అయ్యో! ఆ దీపం ఏవిధంగా ఉన్నది అంటే - తత్త్వ జ్ఞానప్రకాశాన్ని కలవాడై, బలమైన అజ్ఞానాన్ని పోగొట్టుకొని, లౌకికవిషయాలలో ఆసక్తిని లేకుండా చేసికొని, చరమదశలో హరిపాదాలలో ఆత్మను సమర్పించినవాడైన ప్రపన్నునివలె ఉన్నది. ఈవిధంగా హరిపాదాలలో తన ఆత్మను సమర్పించి పరమపదించిన ప్రపన్నునివలె రాత్రి అంతా వెలిగిన దీపం ప్రభాతసమయం కాగానే ఆరిపోయింది. దేశికేంద్రా! నిద్రనుండి లే.

**12.** **దళితారవిందనయన స్సరోమునిః**
**దధదుజ్జ్వలాలికమలాక్షమాలికామ్ ।**
**హరిదర్శనం సమభికాంక్షతి స్ఫుటం**
**ప్రతిజాగృహి శ్రుతిశిరోగురూత్తమ! ॥**

ఓ వేదాంతదేశికాచార్యోత్తమా! సరోముని వికసించిన (తెఱచిన) పద్మాల వంటి నేత్రాలను కలవారై, ఉజ్జ్వలమైన తామరపూసల మాలికనుధరించినవారై భగవానుని దర్శనాన్ని వేగంగా కోరుతున్నారు. నిద్ర లే.

**13.** **ఇద మభిగమోపాదానేజ్యాముఖం పరమార్హణం**
**తురగవదనం జ్యోతిః త్వత్తోఽధిగంతు మపేక్షతే ।**
**తదిహ సమయః ప్రాప్తో యోగోపసంహరణోచితో**
**భవతు భవతః సుప్రాతం శ్రీత్రయీమకుటీ గురో! ॥**

ఓ వేదాంతదేశికాచార్యా! అభిగమం, ఉపాదానం మొదలైన గొప్పదైన ఆరాధనను హయగ్రీవుని రూపంలోని గొప్ప తేజస్సు (తేజోరూపుడైన హయ గ్రీవుడు) నీవల్ల స్వీకరించాలని కోరుతున్నాడు. నీ నిద్రరూపంలోని నీ యోగాన్ని ఉపసంహరించుకొనే కాలం ఇదిగో సమీపించింది. నీకు సుప్రభాతమగుగాక!

**14.** **ఇంధోపయోగం కమలం ప్రబుద్ధ -**
**యోగం ప్రబుద్ధో వినివర్తయ త్వమ్ ।**
**ప్రాప్తోఽద్య దేవాభిగమస్య కాలః**
**శ్రుత్యంచలాచార్యశిఖామణే తే ॥**

వేదాంతదేశికాచార్య శిఖామణీ! (ఉదయకాలంలో వికసించిన ఎట్టుని) కమలం మండే ఇంధనంవలె ఉన్నది. నిద్రనుండి లేచినవాడవై నీవు నిద్ర లేచిన తరువాత నిర్వహించవలసిన కృత్యాలను నిర్వర్తించు. దేవారాధనకు తగిన కాలం ఇపుడు సమీపించింది.



**15.** **గాఢా విద్యేవ రాత్రిః విగలతి విశదజ్ఞానవత్ భానుతేజః**
**ప్రోన్మీలత్యబ్జబంధుః జలజనయనవరో దృక్పథం యాతి మందమ్ ।**
**ఆనందం యాతి సాంద్రం మునిసముదయవద్యోగిలోకః సమంతాత్**
**భూయో వేదాంతవిద్యాగురువర! భవతో దీప్రభాః సుప్రభాతమ్ ॥**

గాఢమైన అవిద్య తొలగినట్లుగా రాత్రి తొలగిపోయింది. విశదమైనజ్ఞానంవలె సూర్యుని తేజస్సు వికసిస్తున్నది. ఆ సూర్యమండలాంతర్వర్తి అయిన పుండరీకాక్షుడు సూర్యుడు, మెల్లిగా కంటికి కన్పిస్తున్నాడు. అంతట మునిసమూహంవలె యోగి సమూహంకూడా ఆనందాన్ని పొందుతున్నది. ఓ వేదాంతదేశికగురువర్యా! నీకు ప్రకాశించే సుప్రభాతం అగుగాక !

**16.** **ఏతే శుద్ధాః విమలవసనాః సత్పవిత్రోర్ధ్వపుండ్రాః**
**సంధ్యాజప్యప్రమద హృదయాః వైష్ణవా స్త్వన్నియోజ్యాః ।**
**త్వత్కైంకర్యప్రవణమతయః త్వత్ప్రబోధప్రతీక్షాః**
**సుప్రాతం తే నిగమమకుటీదేశికేదం దినం స్యాత్ ॥**

ఓ వేదాంతదేశికగురువర్యా ! (స్నానంచేసి) పవిత్రులైనవారు, శుద్ధవస్త్రాలను ధరించినవారు, మంచిపవిత్రాలను, ఊర్ధ్వపుండ్రాలను కలవారు, ప్రాతః సంధ్యాజలంతో ఆనందించిన హృదయాన్ని కలవారు, నీ ఆజ్ఞకు బద్ధులైన వైష్ణవులు నీ కైంకర్యాన్ని చేయడంలో ఆసక్తిని కల మనస్సును కలవారై, నీవు మేల్కొనడం కోసం ఎదురుచూస్తున్నారు. నీకు ఈనాడు సుప్రభాతం కావాలి.

**17.** **నిద్రానుభూతిశబలై రమలైః కటాక్షైః**
**విద్రావితార్తిభి రుపాశ్రితలోకరక్షైః ।**
**భద్రాణి సర్వజగతాం భగవన్ ! విధాతుం**
**నిద్రాం విముంచ నిగమాంచలదేశికేంద్ర! ॥**

ఓ వేదాంతదేశికగురువర్యా! భగవన్ ! నిద్రానుభూతిని సూచించే, అమలాలైన, ఆర్తిని పోగొట్టేవి, ఆశ్రయించినవారిని రక్షించేవి అయిన కటాక్షాలతో సమస్తజగత్తుకు శుభాన్ని కల్గించడంకోసం నిద్రను విడచిపెట్టు.

18. వ్యాకోచనేత్రనలినం వదనం హ్రదం తే
లావణ్యపూరభరితం లలితం విగాఢమ్ ।
కాంక్షంతి సర్వజనతానయనాళిమాలాః
కామం జహీహి కవివాదిమృగేంద్ర ! నిద్రామ్ ॥

కవితార్కికసింహమా! జనులందఱి నయనాలు అనే తుమ్మెదల గుంపు. తెఱచుకొన్న నేత్రాలనే పద్మాలను కల్గినది, లావణ్యమనే నీటితో నిండినది, అందువల్లనే మనోహరమైనది అయిన నీ వదనమనే సరస్సులో అవగాహించాలని కోరుతున్నది. ఇక నిద్రను వీడు.

19. భాష్యాదిగాఢతమతత్త్వబుభుత్సయాఽపి
శ్రీబ్రహ్మతంత్రయతివర్యముఖా మహాంతః ।
క్లృప్తాహ్నికాః సనియమాః ప్రతిపాలయంతి
త్వామాగమాంతగురువర్య! జహీహి శయ్యామ్ ॥

శ్రీభాష్యం మొదలైన చాలా గంభీరాలైన తత్త్వాలను అనుభవించాలనే కోరికతో మహాత్ములైన శ్రీబ్రహ్మతంత్రపరకాలయతీంద్రులు మొదలైనవారు ఆహ్నికకృత్యాలను నిర్వర్తించినవారై, నియమాలను కలవారై, నీకోసం ఎదురు చూస్తున్నారు. వేదాంతదేశిక గురువర్యా! శయ్యను విడచిపెట్టు.

20. భవతాపపరిగ్లపితాం జనతా
మవితా సవితా వినతాంబురుహామ్ ।
అవతాత్ కవితార్కికసింహగురుః
కవితావనితాలలితావసథమ్ ॥

సంసారతాపంచేత బాధపెట్టబడిన జనసమూహాన్ని రక్షించేవారు, తనను ఆశ్రయించినవారనే పద్మాలను రంజింపచేసే సూర్యుడు, కవిత అనే వనితకు అందమైన ఆశ్రయమైన కవితార్కికసింహగురువు రక్షించుగాక !

21. అగణేయ మహాగుణాంబునిధిం
ప్రగుణాత్మగుణార్యగణాభినుతమ్ ।
సుగమాన్ నిగమాన్ కలయంత మముం
నిగమాంతగురుం ప్రణమామ్యుషసి ॥



లెక్కలేనన్ని గొప్ప సుగుణాలకు సముద్రంవంటివారు, గొప్ప ఆత్మ గుణాలను కల ఆచార్యుల సమూహంచేత స్తుతింపబడినవారు, సులభమైన వేదా లను (ద్రవిడవేదాలను) అనుసంధించేవారైన ఈ నిగమాంతదేశికగురువును ఉదయ కాలంలో నమస్కరిస్తున్నాను.

22. సుదాంతం దుర్దాంతక్షపణనిపుణం తం నతతతేః
అనంతం వేదాంతం స్ఫుట ముపదిశంతం కరుణయా ।
మహాంతం శ్రీమంతం గుణనిధి మనంతార్యతనయం
ప్రశాంతం మత్స్వాంతం శ్రయతు నిగమాంతార్య ముషసి ॥

గొప్ప ఇంద్రియనిగ్రహాన్ని కలవారు, జయించడానికి వీలుకాని ప్రతివాదులను నిరసించడంలో నిపుణులు, ఆశ్రయించి శిష్యసమూహానికి అనంతమైన వేదాంతాన్ని దయతో స్ఫుటంగా ఉపదేశించేవారు, మహాత్ములు, కైంకర్యలక్ష్మిని కలవారు, అనంతార్యుల కుమారులు, గొప్ప శాంతగుణాన్ని కలవారైన నిగమాంత దేశికులను నా హృదయం ప్రాతఃకాలంలో ఆశ్రయించాలి. (ధ్యానించాలి.)

23. కలయామి సూరివలయార్చితం కృపా -
నిలయం మహః కువలయామృతద్యుతిమ్ ।
భ్రమమౌగ్ధ్యదూరమౌజ్జ్వలీనిధిం
శ్రమమౌఢ్యహృన్నిగమమౌలిదేశికమ్ ॥

పండితసమూహంచేత ఆరాధింపబడినది, కృపకు నిలయమైనది, కలువ పూవువలె అమృతద్యుతిని (మనోహమైన ప్రకాశాన్ని కల్గినది), భ్రమకు, అజ్ఞానానికి దూరమైనది, గొప్ప కాంతికి నిధి, శ్రమను, మూఢత్వాన్ని తొలగించేది అయిన నిగమాంత దేశికులనే తేజస్సును భావిస్తున్నాను.

24. ఉపాశ్రితద్యుపాదపం కృపావనమ్రపావనం
సుపాణిపాదపల్లవం వ్యపాస్తసర్వపాతకమ్ ।
విభావరీశభావిత ప్రభాననం శుభాసనం
సుభావనం విభావయే త్రయీశిఖాద్వయీగురుమ్॥

ఆశ్రితులకు కల్పవృక్షం, కృపతో నమస్కరించినవారిని పావనం చేసేవారు, చక్కని పాదాలు, హస్తాలనే చిగుళ్ళను కల్గినవారు, సమస్తపాతకాలు తొలగినవారు,

చంద్రునివలె ప్రకాశించే ముఖాన్ని కల్గినవారు, మంగళకరమైన సింహాసనాన్ని కలవారు, మంచి భావనను కలవారైన వేదాంతదేశికగురువును భావిస్తాను.

**25. మాధవారాధనం బోధనశ్రీధనం**
**సాధు యూధవ్యథోద్ఛేదనిర్భేదనమ్ ।**
**వాదియూధానతం వేదవాదస్ఫుర**
**న్మోదమీడామహే వేదచూడాగురుమ్ ॥**

మాధవుని ఆరాధించేవారు, బోధనమనే గొప్ప ధనాన్ని కలవారు, సత్పురుషుల సమూహాల వ్యథను పోగొట్టేవారు, ప్రతివాది సమూహంచే నమస్కరింపబడేవారు, (తాము చేసే) వైదికవాదాలద్వారా (పండితలోకానికి) గొప్ప ఆనందాన్ని కల్గించే వారైన వేదాంతదేశికగురువులను స్తుతిస్తున్నాను.

**26. ఏతైః శ్లోకైః వలీకైః ప్రగుణగుణగణం త్వాం స్తువన్ త్వత్ సపర్యాం**
**శ్రీకృష్ణబ్రహ్మతంత్రాదిమపదకలిజిత్ సంయమీ సంయతాత్మా ।**
**వాంఛేయ త్తర్హి దీవ్యత్తరణిఘృణిగణ ప్రస్ఫుటాబ్జచ్ఛటాంతః**
**మాధ్వీసాధ్వీభిరేనం స్నపయ ఘనకృపాపాంగధారాభిరారాత్ ॥**

ఛందోబద్ధమైనవి, సంగీతాత్మకమైనదీ అయిన ఈ శ్లోకాలతో గొప్ప గుణాల సమూహాన్ని కల్గిన నిన్ను స్తుతిస్తూ, నీకు సపర్యను చేయాలని ఆత్మనిగ్రహాన్ని కల, పూతాత్ములైన శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాల యతీంద్రులు కోరుతున్నారు. అందువల్ల, నీవు ప్రకాశించే సూర్యుని కిరణగణాలవల్ల బాగా వికసించిన తామర పూల సమూహంలోపల ఉండే మకరందంతో సమానమైన, నీ గొప్ప కృపాకటాక్షాల ధారలతో ఈ యతీంద్రులను తడపు. (అనుగ్రహించి, ఆనందింపజేయాలి.)

**27. విజయతాం గురుపంక్తిశిఖామణిః**
**విజయతాం యతిరాజమతధ్వజః ।**
**విజయతాం కవితార్కికకేసరీ**
**విజయతాం నిగమాంతగురూత్తమః ॥**

ఆచార్యపంక్తికి శిఖామణి (ఆచార్యులలో గొప్పవారు), శ్రీరామానుజ మతాన్ని ప్రకాశింపజేసే ధ్వజంవంటివారు, కవులలో, తార్కికులలో సింహంవంటివారు అయిన నిగమాంతదేశికులు వర్ధిల్లాలి వర్ధిల్లాలి వర్ధిల్లాలి వర్ధిల్లాలి.